# బోధచంద్రోదయ.

(ఆంధ్రానువాదము.)

శ్రీశ్రీశ్రీ తత్వానందస్వామి.

# ప్రబోధచంద్రోదయ నాటకము.

(తేట తెలుగు ప్రతి)

ప్రథమ ముద్రణము

1000 ప్రతులు

కతి ముద్రాక్షరశాల, తెనాలి.

1933

12 ప్రతులు రు 3-0-0

100 ప్రతులు „ 20-0-0

వెల ప్రతి రు. 0—6—0

శాంతి—భక్తి జ్ఞాన వైరాగ్యములను, వేదాంతానుష్ఠాన
రూపమున విశ్వశాంతిని ప్రచారము గావించు ఆంధ్ర మాసపత్రిక.
సంవత్సరపుచందా రు. 2. మాత్రము.

**Peace**—భక్తిజ్ఞానవైరాగ్యములను, వేదాంతమతరహస్యము
లను తేటతెల్లముగ బోధించు ఆంగ్ల మాసపత్రిక.
సంవత్సరపుచందా రు 3-0-0 మాత్రము.

మాదిరి సంచికలు ఉచితము.

పై రెండు పత్రికలకు కలిసి సంవత్సరపుచందా రు 4-0-0 మాత్రము.

ఈపత్రికల కొఱకును, శ్రీశ్రీశ్రీ ఓంకారస్వాములవారి గ్రంథ
ములకొఱకును, శ్రీశ్రీశ్రీ రామతీర్థస్వాములవారి గ్రంథ సంపుట
ములకొఱకును వ్రాయువారలు-

మేనేజరు:—శ్రీ శాంతిఆశ్రమము,
శాంతిఆశ్రమపోస్టు, పెద్దాపురముతాలూకా,
తూర్పు గోదావరిజిల్లా,
అని వ్రాయవలయును.

---

# యథార్థభారతి.

భక్తి జ్ఞాన వైరాగ్య యోగమార్గములను, ఆశ్రమ చతుష్టయ
ధర్మములను, శ్రీరామకృష్ణ పరమహంస, వివేకానందప్రముఖ మహ
నీయుల సద్బోధలను ప్రచారముచేయునిమిత్తము శ్రీశ్రీశ్రీ మల
యాళ సద్గురునిచేత ప్రకటింపబడు మాసపత్రిక, ఇందు శ్రీ సద్గురు
మలయాళస్వాములవారి వ్యాసరాజములు ప్రధానములు.
సం. చందా రు 2-4-0.

శ్రీ సద్గురు మలయాళ స్వాములవారి గ్రంథములను,
శ్రీయుత సాయం వరదదాసుగారి గ్రంథములను శ్రీ తత్వానంద
స్వాములవారి గ్రంథములను కోరువారు మా కార్యాలయమునకు
వ్రాసి తెప్పించుకొనవచ్చును.

మేనేజరు:—శ్రీ వ్యాసాశ్రమము,
యేర్పేడుపోస్టు, చిత్తూరుజిల్లా.

# పీఠిక.

ఈనాటకము సంస్కృతమున శ్రీకృష్ణమిశ్రుడను ప్రఖ్యాత కవివరుడు సుమారు పది శతాబ్దముల క్రిందట వ్రాసియుండినటుల పండితులు పలుకుచున్నారు. దీనిని ఆంధ్రకవులు కొందఱు భాషాంతరీకరణము గావించియుండిరి. ఈ గ్రంథములు పండితప్రవరులకును, హెచ్చుగ చదువులు చదివినవారికిని కొంత పరిశ్రమ చేసినమీదట గ్రహింపగల్గునవిగ నున్నవి.

ఈ నాటకకథ వేదాంత జిజ్ఞాసువులకు అత్యంత ప్రీతికరమై యొప్పును. అనేక సాధనారహస్యములను, మానసిక పరిణామావస్థలను, నీతిధర్మములను భావగర్భితముగ నిది బోధించును. లోతునకు పోయిగాఢతరవిచారణ చేయనెంచనివారికినికథాక్రమముసుగ్రాహ్యముగను మనోహరముగను నుండును. ఇందలి పాత్రల పేర్లువినిన తోడనే కొంత కథాసరణి తెలియవచ్చును. వారిసంభాషణల చమత్కృతియు ఔచిత్యమును మూలగ్రంథరచయితవలన బహువిధముల పోషింపబడియున్నవి.

ఇటీవల ఈకథను వినినవార లనేకులు, ఆనందభరితులై, ఇది సామాన్యపు చదువుగలవారలు పఠించి ప్రదర్శనములు చేయుటకు అనువగునటులను, ఏమియు చదువురానివారలుసయితము దీనిని వినియు ప్రదర్శనముల చూచియు సులభముగ గ్రహించి నీతిగఱచుటకు తగునటులను తేటతెలుగున ఈనాటకమును అనువదింపుడని శ్రీశ్రీశ్రీ తత్వానందస్వాములవారిని కోరియుండిరి. వారి కోరికకు అనుసరణముగ శ్రీ స్వాములవారు ఈనాటకమును అనువదించియుండిరి. ఇందలి పద్యములును, కీర్తనలును శ్రీయుతులు పులివర్తి శరభాచార్యులు (బి. యే.) గారును, సాయం వరదదాసుగారును రచించియుండిరి. అందందు కొన్ని మార్పులుకూడ చేయబడినవి.

ప్రస్తుతరూపమున ఈనాటకము సర్వత్ర ప్రదర్శనయోగ్యముగను, చదువుకొనుటకు మిక్కిలి ఆనందదాయకముగను నున్నదనుట నిర్వివాదము. తక్కుంగల గుణవిమర్శనముసేయ పాఠకులే అర్హులు. ఈగ్రంథవిషయము సర్వసాధారణముగ ప్రచారములో నుండవలసినది గాన వెల ఆరుఅణాలుగ మాత్రమే నిర్ణయించబడినది.

తెనాలి,
గుంటూరుజిల్లా;
8-6-33.

మేనేజరు,
శ్రీ ఓంకారాశ్రమము.

# ప్రబోధ చంద్రోదయ నాటకము.

## ప్రధాన పాత్రలు.

వివేకుడు—మనస్సునకు నివృత్తిదేవికి కొమరుడు; కథానాయకుడు

వస్తువిచారుడు, సంతోషుడు—వివేకుని సేనాపతులు.

మనస్సు—ఈశ్వరునకు మాయవలన కలిగిన కొమారుడు.

క్షమ—వివేకుని సేనా నాయకురాలు.

మతీదేవి—వివేకుని భార్య.

ఉపనిషద్దేవి—వివేకుని భార్య; ప్రబోధచంద్రోదయుని తల్లి.

శ్రద్ధ—సత్వపుత్రి, శాంతికి తల్లి.

శాంతి, కరుణ, మైత్రి—వివేకుని సహచారిణులు.

సంకల్పుడు—మనస్సునకు సహచరుడు.

వైరాగ్యుడు—మనస్సు కొడుకు.

ప్రబోధచంద్రుడు—వివేకునికి ఉపనిషద్దేవికి కొమరుడు.

విష్ణుభక్తి, సరస్వతి—వివేకుని యిష్టదైవతములు.

పురుషుడు—జీవుడు.

నిదిధ్యాసుడు—విష్ణుభక్తిదేవియొక్క దూత.

మహామోహుడు—మనస్సునకు ప్రవృత్తిదేవికి కొమరుడు-ప్రతినాయకుడు. కాముడు, క్రోధుడు, లోభుడు, దంభుడు, అహంకారుడు చార్వాకుడు, దిగంబరసిద్ధాంతి, బుద్ధాగముడు, సోమసిద్ధాంతుడు-మహామోహుని సేనాపతులు, పరివారములోనివారును.

నాస్తికత—మహామోహుని ఉపపత్ని.

రతి, హింస, తృష్ణ—వరుసగా కామునికి, క్రోధునికి, లోభునికి భార్యలు. వీరుగాక కథానుసరణముగ కొందఱు స్త్రీపురుషులు వత్తురు.

---

# ప్రబోధ చంద్రోదయము.

## ( నాటకము. )

### నాంది

కటిక చీకటి పొలగ్రమ్మి కండ్లుమూసి
నిదుర మైకములందు మున్గిన జగాల
కుం ప్రబోధము నొసగూర్చు పరమ
తేజఁ డెల్లఱ నాశీర్వదించుగాక !

(నాంద్యంతమున సూత్రధారుడు తెరవంక జూచి)

సూ—ఓసీ ! నీ అలంకరించుకొనుటలు ఇంకను ముగియలేదా ! ఏల ఈ మాంద్యము ? నీకైనీవు ఎన్నడును కర్తవ్యమేమి ? అని ప్రశ్నించి ఎఱిగి పనుల సేయవుగదా !

నటి—నాథా ఇదె వచ్చితి. ఈ అలుకయేల ?

సూ—సభ్యులు ఎందాక వేచియుందురు? మనము ఆలసించి వారి శమమునకు ఒత్తిడి గల్గించరాదు.

నటి—మీ ఆజ్ఞ ఏమి?

సూ—త్వరగ నెరవేర్తువా?

నటి—ప్రకృతితత్వము వేగిరపడునది కాదు. నా తత్వమును మీరెఱుంగుదురు కదా !

సూ—కొంత స్తబ్ధవైయైనను ప్రబోధము నందుచుందువు కూడను.

నటి—అయ్యది మీ అనుగ్రహమహిమ. ఇప్పుడేమి చేయుదము ?

సూ—మంచిది. ప్రబోధచంద్రోదయ నాటకమును ప్రదర్శించి ఈ సభ్యుల అభినందనముల పడయగలమేమొ చూతము.

నటి—సరిసరి ! అదెన్నడో పదిశతాబ్దములనాడు రచించిన ప్రాతనాటకముగదా ! ఇప్పటివారికి రుచించునా ? ఆ భావమేలు; ఆ భావ సరణి వేఱు.

సూ—అట్టి సంశయము వలదు. మనముచేకొను ప్రతి, తేట తెలుఁగున కూర్పబడిన సంగ్రహానువాదము. చాల మనోహరముగా నున్న దనియే మిత్రులు కొందఱు చెప్పియుండిరి. అందలి భావములు సర్వకాలము సర్వజనులకు హృద్యములుగ ఉండగలవియే !

నటి—మాతృకను రచించినదెవరు ? మఱచితిని.

సూ—కృష్ణమిశ్రుడను మహాకవి.

నటి—ఆంధ్రానువాదము కాన కొంత నేర్పును చూపి సభ్యుల రంజింప గలమని తలంతును.

సూ—అవును; నీపిఱికితనమును నీడి సకలమును ఆయత్తము చేయుము. మనయెడ కరుణాదరమతులగు ఈ సభ్యుల ఎదుట మనము జంకనేల ? శక్తికొలది ప్రయత్నింతము.

నటి—ఈ విషయము మీరిదివఱకే సూచించియుంటిరి. మన నట బృందము ఆయత్తపడుచునే యుండెను.

సూ—అటులగుచో వేగిరము నాటకప్రదర్శనమును ఆరంభింతము.

గీ. ఈ ప్రదర్శన దీవించు నీశునాజ్ఞ
సువివేక ప్రబోధ చంద్రికలు తరలి
హితవిజయ మొందుగాత ! దోషైకదృష్టి
మూఢమాయాభిరతు మహామోహు నడచి.

అలజగన్నాటక సూత్రధారుడే మన ప్రదర్శనము నాశీర్వదించి,

మఱియు కుటిలమతియై మనదాసగుల గోరంతల కొండంతలుచేసి, మాయావాదముల నలుపు నెవడేని గల్గుచో అట్టి మహామోహుని వివేకప్రబోధ చంద్రికలచే నడచుగాత!

## తెర లో

ఓరీ! పాపీ! నటాధమా! ఏమీ నాదేహములో ప్రాణము ఉండగనే మాస్వామియైన మహామోహామహారాజుగారికి వివేకుని వలన పరాజయమును సూచించుచున్నావుగా!

సూ. (తొట్రుపాటుతో) ఓసీ! చూడుము! కాముడు రతీదేవితో కూడి ఇటు వచ్చుచున్నాడు. నామాటలవలన పుట్టిన క్రోధము మూర్తీభవించినట్లు కనపడుచున్నాడు. మనమిట నిలువరాదు. తొలగిపోవుదము.

(నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.

---

# ప్రబోధ చంద్రోదయము.

## (నాటకము.)

## ప్రథమాంకము.



(వెనుక చెప్పిన తీరున కాముడు రతీదేవితోఁగూడ ప్రవేశించును.)

కాముడు—(కోపముతో) ఓరీ! పాపీ! నరాధమా! ఏమీ నా బొందిలో ప్రాణములుండఁగానె, మాస్వామియైన మహామోహ మహారాజుగారికి అపజయమును, వివేకునికి విజయమును ఉదాహరించుచుంటివా? ఔరా?

ఈ భువిలో ఆడవాండ్ర చూపులనెడు మంటల సమూహములు పర్వకుండనుండునంతవఱకేగదా మహావిద్వాంసుల మనసులయందైనను, శాస్త్రజన్యవివేకమేని సంభవిల్లుట? సుందరమందిరములు, సొగసుగత్తెలగుస్త్రీలు, తుమ్మెదరొదలు, కమ్మనితెమ్మెరలు, పున్నమరేలు, అన్నియు నాకుఅడ్డులేని బలంబులై ఒప్ప, అల వివేకుడు. గెలుపొందుట ఎట్లు? ఇక ప్రబోధుడు పుట్టుట ఎట్లు?

రతీ—ప్రాణేశ్వరా! మహామోహమహారాజుగారి శత్రువయిన వివేకుడు సామాన్యుడుకాడని తలచుచున్నాను.

కాముడు—ఓసీ భీరుస్వరాలా! స్త్రీస్వభావజన్యమగు పిఱికితనము చూపట్టగా ఆ వివేకునకు నీ వేల భయపడెదవు? చూడుము. నావిల్లుచెఱకు; నాబాణములు పూలే! ఐనను ఈమూడు లోకములును నాకు జోహారనక, నా ఆజ్ఞమీరి ధైర్యమున నిలువగల్గునా? ఎఱుగవా!

మోహన—రూపకం

నాసమాన మెవరీధారుణీ
నరులను ఘనమోహంబను
వనధిని ముంచెద నొంచెద॥ నాసమాన॥

1. నాదుశ్రీఆజ్ఞమీరి నడవ
నళినభవునికైనదరమె?

వరులు సురలు నాకు నెదురె?
తరుణులచూపుల ఉరులకు
పులుగులజేసెద నందఱ॥     నాసమాన॥

2. పరసతి యనక అహల్యను
వరించెను సురనాధుడు;
పాపమనక తన తనయనె
పట్టెను బ్రహ్మయు మును, నా
దిట్టతనము చేతన గదె!     నాసమాన॥

రతి—ఓ ప్రాణేశ్వరా! అది అంతయు సత్యమె. కాని ఈ శత్రువు సాహాయ్యసంపన్నుడు. కనుక శంకించవలసియున్నది. అహింసా అస్తేయాదులును యమ నియమ ప్రముఖులును వాని ప్రధానులు మంత్రులు అనియు,మహాబలవంతులనియు వినుచున్నాము.

కాము—ఓసివెఱ్ఱిదానా! బలవంతులని వివేకమహారాజును వాని యమ నియమాది మంత్రులనుమాత్రమే పేర్కొనుచున్నావు. కాని మాపక్షము వారిని తలపున నిలపకున్నావు. మేము పూనికతో తారసిలినంత మాత్రాననే, వారందఱును నిమిషములో చెల్లాచెదఱగుదురు సుమా! మాక్రోధుని యెదుట అహింస ఎంత? నేను కను తెఱచుచో బ్రహ్మచర్యాదులెంత? లోభుని మ్రోల సత్యుడు, అపరిగ్రహుడు, అస్తేయుడు ఎంతటివారు? ఇక నీవు పేర్కొనిన యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధు లనెడువారి మాటేల? వారు జడమతులకడతప్ప నిలువనోపరు! వారిని నశింపచేయుట అతిసులభము. అంతేకాక, వారిపాలిటి మృత్యుదేవతలయిన స్త్రీలు ఎందఱోనాకు స్వాధీనురాండ్రై మెలగుచుండ్రు గదా! ఈ స్త్రీల చూడ్కులు, తేనెలొలుకు వీరిపలుకులు, వీరికౌగిలింతలు, వీరివిలాసాలు, వీరి హాసక్రీడలు, ఇంతేల వీరిపేరు చెప్పిన చాలదా? ఏ జడమతులకైనను హృదయము కలంకు

నటుల చేయుటకు? ఇంకను మన ప్రభువువారి ఆప్తులైన మద మాన మాత్సర్య దంభాదులు ఎందఱో కలరు!

రతి—ఓహృదయేశ్వరా! మీకును శమ దమ వివేక ప్రముఖులకును జన్మస్థానము ఒక్కటియే అని విన్నదానను!

కాము—ఓహో! జన్మస్థానము ఒక్కటగుటేగాదు. మాకు జనకుడును ఒక్కడే! ఎట్లన ఈశ్వరునివలన తొలుత మాయయందు, మహిలో మహావిఖ్యాత పురుషుడగు మనస్సుఅనెడు సుతుడు పుట్టినాడు. ఈ ఈశ్వరపుత్రుడే మొదట ఎల్లజగములను సృష్టించి, వానికి తాను శాశ్వతకర్తయైనాడు. అతనికి ప్రవృత్తి దేవి నివృత్తిదేవి అను ఇద్దఱు భార్యలుకలరు. వారిలో ప్రవృత్తి దేవి వలన మహామోహుడు మూలపురుషుడుగాగల మా వంశము పుట్టినది. నివృత్తిదేవి వలన వివేకుడు మూలపురుషుడు గాగల ఆరెండవ వంశముపుట్టినది.

రతి:—ప్రాణనాయకా! అటులయిన సహోదరులగు మీలో మీకు ఇటువంటి పరస్పర కలహము ఎందులకు?

కాము:—భువిలో ఇదొక వింతకాదు.

గీ. ఏకవంశముననె జన్మమెత్తినాము
ఒకడె మాకందఱకు తండ్రి ♦ యువిద వినుము
కౌరవులకు పాండవులకు ♦ కలిగినట్లు
ఘోరవైరము మాకొన ♦ గూడె నిపుడు.

ఒక్క వంశమున పుట్టుటచేతనే వైరములు మెండగుట! రాజ్యముకొఱకై కౌరవ పాండవులు పోరాడి వంశవినాశనము కూర్చు కొనలేదా? ఈ జగత్తు సర్వమును మా పితృార్జితము. జనకునకు మా యందు పక్షమగుటచేత, విశ్వమునంతను మేమే ఆక్రమించుకొం టిమి. కాన నిలువ నీడలేక యదాయదలైన తనవారితో, వివేకుడు అందందు తిరుగులాడుచున్నాడు. ఇప్పుడు ఆ పాపాత్ములు రోషము

పెంచుకొని తండ్రిని మమ్మును నిర్మూలము చేయుటకు పూనుకొని యున్నారు.

రతి—పాపము శమించుగాక! ద్వేషమాత్రము చేతనే, వారు ఇప్పు డీ ఘోరకార్యమునకు పూనిరా? వారికి ఇప్పుడు క్రొత్తగ చూపట్టిన సదుపాయము ఏమైన కలదా?

కాము—నీ స్త్రీస్వభావము నీకు వెఱపుపుట్టించును. కావున ఆపాపాత్ముల దారుణప్రయత్నములను నీకు వివరింపజాలకున్నాను.

రతి—నాథా! ఆప్రయత్నములు ఎట్టివో దయయుంచిచెప్పుడు తప్పదు.

కాము—ప్రియురాలా! భయపడబోకుము! వారివి కేవలము గొంతెమ్మకోరికలే. ఎన్నడును ఫలించునవికావు. కాళికాదేవితో సమానురాలగు విద్య అనురాక్షసి మనవంశమున పుట్టనున్నది అని ఏదో లోకప్రవాదము కలిగినది.

రతి—(భయముతో) అయ్యో! ఏమిగతి? మన కులమునందు రాక్షసి ఎట్లు పుట్టును ?

కాము—జడియకు! జడియకు! ఇది నిరాధారమగు వట్టి వదంతి!.

రతి—ఆరాక్షసి ఒకవేళపుట్టినయెడల అది చేయగలపని ఏమి ?

కాము—బ్రహ్మదేవుని భార్య సరస్వతి కలదుగదా! ఆమె ఇట్లు ఒక వాదు కల్పనచేసినది: “సంగములేని ఈశ్వరుని వలన మాయాదేవి మనస్సు అనెడు కొడుకును కన్నది. వీరివంశమున విద్య అను పుత్రిక కలుగబోవుచున్నది. ఈ విద్య తన తండ్రిని తన తల్లిని తోబుట్టువులను కులమును మ్రింగివేయును”.

రతి—రక్షింపుము, రక్షింపుము. (అనుచు భర్తనుకౌగిలించుకొనును.)

కాము—ప్రియురాలా! నీకు ఈ భీతిఏల? మేము జీవించియుండగ ఆ విద్య ఎటులపుట్టగలదు?

రతి—అట్టి రాక్షసి పుట్టుట మీ ప్రతిపక్షులకు సమ్మతమేనా?

కాము—అవును; సమ్మతమే. ఈ విద్య వివేకునకు ఉపనిషత్కాంత యందు ప్రబోధచంద్రునితోడ పుట్టబోవునట. శమ దమాదులు అందఱును అందులకై తలక్రిందుగ తపస్సులు చేయున్నారు.

రతి—హృదయేశ్వరా! తమకును వినాశహేతువే అగు విద్యయొక్క పుట్టువును ఆ దుర్వినీతులు కోరుకొననేల?

కాము—ప్రేయసీ! కులక్షయము కూర్చునున్న పాపకర్ములు వారు. వారు తమకు ఎదురై వచ్చు అపాయమును ఎట్లు గణింతురు? స్వభావముచేత దుష్టులగువారి జననము వారికిని వారిని కన్న వారికిని ముప్పువాటిలచేయును. పొగ తనను కన్న నిప్పును ఆర్చి తుదకు తానును నాశమొందుట చూడమా? వివేకుడు మున్నగువారు అట్టి పాపకర్ములు!

(తె ర లో)

పాపీ! దురాత్మా! ఏమిరా! పాపకర్ములమని మమ్మే ఆక్షేపించు చుంటివా? "గర్విష్ఠయై దుర్మార్గగామియై కార్యాకార్యదక్షత లేని గురువునైనను తండ్రినైనను కర్తవ్యమెంచి త్యజించవలయును." అని శాస్త్రములు పలుకుచున్నవి. అదియునుగాక ఈ మా జనకుడే అహంకారునితో చేరి తన తండ్రియైన జగత్పితను బాధించియున్నాడు. మహామోహునులుకూడ అతనిని పాశ బద్ధుని చేసిరిగదా!

కాము—ప్రియురాలా! అదె మాకులవృద్ధుడయిన వివేకుడు భార్య యగు మతీదేవితో కూడి వచ్చుచున్నాడు. మనము ఇట నిలువ రాదు. పోవుదము. (నిష్క్రమింతురు.)

(వివేకమహారాజును మతీదేవియు ప్రవేశింతురు.)

వివే—ప్రియురాలా! దుర్వినీతుడయిన ఈకాముని మాటలువిన్నావు గదా? వీడు మనలనే పాపాత్ములనుచున్నాడు. ఆహా! నిరంజ నుని జ్ఞానానందుని, అలజగదీశ్వరుని మోహాంబుధిలో ముంచి,

ఆశాపాశంబులం బంధించి ఈ మహామోహాదులు దీనదశం కూర్చినారు. అట్టివారు పుణ్యాత్ములట! వారిచేత పరాభవింపబడిన ఈశ్వరుని విముక్తునిచేయ ప్రయత్నించుచున్న మేము పాపాత్ముల మట!

బ్యాగ్ - ఆది.

1. ఏమి విచిత్రము ఏమికాలము
ఏమికాహ్రుల పాపభాషణము? ఏమి॥

కామ విదూరుని జ్ఞానానందుని
స్వామిని బంధితు జేసిరి నష్టులు॥ ఏమి॥

2. ప్రభు పరిచర్యల జేసెడు మేము
పాపాత్ములమట! పాతకంబనక
దైవద్రోహము గావించిన యీ
ధర్మవిదూరులె పుణ్యాత్ములట! ఏమి॥

మతి—ప్రాణేశ్వరా! పరమేశ్వరుడు సహజానందసుందర స్వభావుడు; నిత్యప్రకాశుడు; సకలభువన ప్రచారుడు అని విందుము. అట్టివాడు ఈ దురాత్ములచేతం జిక్కి మోహారాశి మునింగెనా?

వివే:—ప్రియురాలా! మహాశాలియైనను, ప్రవిమల శాంతశీలుడైనను, మహదైశ్వర్య భాసమానుండైనను, పురుషుడు ఏ మాయలాడి వలలోనో చిక్కుపడెనా, వివేకశూన్యుడగునుగదా! అట్లే ఈ మహాపురుషుడు దీటులేని ప్రతిభాశాలినియగు, మాయామహాదేవి మోహపాశములందగులువడి, చిరతర సహవాసమహిమవలన, తన్నుతామఱచి, స్వస్వరూపమును ఎఱుగజాలకున్నాడు!

మతి—ప్రాణవల్లభా! అటుల సంభవించునా?

గీ. ఏటికీమాటలోనాధ బూటకములు
నమ్మగాజాల నివార్త నెమ్మనమున

తిమిర రేఖచే భానుండు దీప్తిసెడిన
అపుడు దేవుడు మాయచే నడగునేమొ.

సహస్రకిరణుండగు సూర్యుడు అత్యల్పమగు ఒక్క అంధకార రేఖచేత కప్పుపడుట సంభవించునే? దేదీప్యమాన ప్రకాశసాగరుండగు దేవదేవుడు అల మాయచేత అణగిపోవుట నిజముగ ఘటిల్లెనా?

వివే—ప్రియురాలా ! ఆ మాయామహాదేవిజాడ ఇట్టిదని ఊహించుట మనకు శక్యము కాదు. వారాంగనవలె ఆ వన్నెలాడి అసత్య భావముల ప్రకటించి, ఆ పరమపురుషుని వంచించుచున్నది. స్వయంప్రకాశుడై స్ఫటికమువలె స్వచ్ఛకాంతితో తేజరిలు దేవుని ఈ అల్పురాలు వికారములం చిక్కువడచేయుచున్నది. ఈమె సంసర్గమువలన ఆ సర్వేశ్వరుడు తన తేజమును ఒకింతయు కోల్పోవడు. కాని, ఈ మహామాయ వానికి, కటా! కళంకమును ఆపాదించగల్గుచున్నది.

మతి—ఉదారచరితుడంయిన ఆ మహామహుని ఆ పరమదుష్టురాలు ఏకారణమువలన వంచించుచున్నది ?

వివే—మాయ కారణమును గాని ప్రయోజనమునుగాని విచారించి వర్తించునదికాదు. దుష్టస్త్రీలకు అట్టివృత్తము సహజమే. వారు పురుషులను మోహపెట్టుదురు. బుద్ధికలంత్రు; విషాదపెట్టుదురు; నెఱపింతురు. శృంగారచేష్టలచేత కరగింతురు. తమదాసులుగ చేసికొందురు.—మఱియొక కారణమును కలదు.

మతి—ప్రాణేశ్వరా ! అది ఏది ?

వివే—ఆ దురాత్మురాలు ఇటుల తలచినది.

క॥ "నా యౌవనము చనెను. మా
ఆయన విషయైక నిరతియంతయు మున్నే
పోయెను. సుతు మనసు జగ
ద్ధ్యేయ శ్రీపరమపదము నెక్కొనవలెన్."

ఇట్లుయోచించు ఆ తల్లి అభిప్రాయానుసారము వర్తింప నియ్యకొనిన మనస్సు నవద్వారపురములను కల్పించుకొన్నాడు. తాను ఒక్కడయ్యును ఆ శరీరపురములందు చొచ్చి, స్ఫటికమణిబోలి తన విక్షేపచేష్టలను వానికి అలవరచినాడు. ఈమనస్సుయొక్క జ్యేష్ఠపుత్రుని సుతుడును, తన మునిమనుమడును అగు అహంకారుడువచ్చి తనను కౌగలించుకొనగా పరమేశ్వరుడు పరవశుడైనాడు. భ్రమసి అవిద్యకల్పించు నిదురంబడిపోయినాడు. మనస్సుచేయు మహాత స్వప్నకల్పనలందు తగులువడినాడు. "నేను పుట్టితిని, వీరు నా తలిదండ్రులు, వీరు నా పుత్రులు, వీరు నా బంధుగులు, వీరు నా మిత్రులు వీరు నా శత్రువులు, ఇది నా బలగము, ఇది నా కులము, ఇది నా విద్య అనుచు ఏమేమో చిత్రవిచిత్రములగు కలల గాంచుచున్నాడు.

మతి—ప్రాణనాయకా! ఈప్రకారము అతి దీర్ఘమైన నిద్రచేత, ప్రబోధము చెడియుండగా, ఆపరమేశ్వరునియందు ప్రబోధసంభవము ఎట్లు?

వివే—స్త్రీలహృదయము తఱచుగా అసూయవలన పీడితమగుచుండును. నాయందు అపరాధమును ఎంతువేమో అని శంకించుచున్నాను. శ్రేయస్సునకు ఎన్నియో విఘ్నములు.

మతి—ప్రాణప్రియా! అన్యాశలుగల స్త్రీలుమాత్రమే భర్తల యీప్సితములకు విఘ్నములు కల్పింతురు.మీరు సదా ధర్మవ్యాపారపారీణులుగదా! శంక వీడి చెప్పుడు.

వివే—ప్రియురాలా! శాంతి శమాది ముఖ్యుల సాహాయ్యమువలన ఉపనిషద్దేవియోగము నాకు లభించినయెడల, నీవొక్క క్షణము విషయేచ్ఛలు మాని జాగ్రత్త నుండితువేని, ప్రబోధప్రాప్తి ఘటిల్లును.

మతి—ప్రాణవల్లభా! అహంకారాభిమానినైననుకూడ, కులప్రభునికి బంధవిముక్తి కలుగునెడల, దేవరవారికి అల ఉపనిషద్దేవితో నిత్యానుబంధము పడుగుగాక! నాకెంతయు సమ్మతమే.

వివే—నీయౌదార్యము శ్లాఘనీయము! ఆలాగైన పక్షమున నామనోరథములు అచిరకాలములో సిద్ధములయినట్లే! జగములకు ఆదియు, ప్రభువును, సదాధారమును నగు ఈశ్వరుని బహు రీతుల భాగించి, దేహములందు బంధించివేసి, మృత్యుపదము ప్రాపింపజేసి, బ్రహ్మద్రోహులయిన వారలకు మరణాంతిక ప్రాయశ్చిత్తము కావించెదు. విజ్ఞానమహిమను పెంచి, బ్రహ్మైక్య భావమును పుడమిని పునరుద్ధరించెదగాక. ప్రస్తుతకార్యసిద్ధికై శమ దమాదుల సమకూర్తము రమ్ము.

కల్యాణి—ఆది.

1. నాదు మనోరథ మీడేరు నాహహా॥ నాదు॥
భేదములన్నియు గ్రోలెదనిక
రాదు అజ్ఞానము ఈ ధారుణికిక॥ నాదు॥

2. పరమేశ్వరుని భిన్ను నిజేసిన
పాపాత్ములకును ప్రాయశ్చిత్తంబగు నిక॥ నాదు॥

3. బ్రహ్మైక్యంబును భావనచేయగ
బ్రహ్మజ్ఞానము ధర భాసిల్లెను నిక నాదు॥

4. ఆనందము బ్రహ్మానందంబగు
అఖండ పరిపూర్ణానుభవమగునిక॥ నాదు॥

(నిష్క్రమింతురు.)

# ప్రబోధ చంద్రోదయము

## (నాటకము)

## ద్వితీయాంకము.



(దంభుడు ప్రవేశించుచున్నాడు.)

దంభు:—

గీ. దంభుడను పేరువాడ సత్యప్రసక్తి
పూను మానిసి ఎవడు నే బూనియున్న ?
నాప్రతాపం బెఱుంగగా నలవియగునె
ధాతకైననువాని ముత్తాతకైన ?

మహామోహమహారాజుగారు నన్నుపిలిచి ఇట్లాజ్ఞాపించినారు. “వత్సా! దంభా! మంత్రిసహితముగా వివేకుడు వారణాశీనగరమున విడిదిదిగియున్నాడు. ప్రబోధచంద్రోదయముకోరి శమ దమ ఉపరతి తితిక్ష శ్రద్ధ సమాధానముఖ్యులను ఆయా తీర్థములకు పంపియున్నాడని విన్నాను. మన కులక్షయము ఆసన్నమగుచున్నది. దీనిని మాన్పుటకు మీరు శ్రద్ధవహించవలయును. వెంటనే ప్రతిక్రియచేయవలయును. భూలోకములోనికెల్ల ప్రధాన ముక్తిక్షేత్రము వారణాశీనగరము. నీవుఅచ్చటికిపొమ్ము. అచ్చటి నాలుగాశ్రమములవారియొక్కయు ముక్తిప్రయత్నములను ధ్వంసముచేయుము.”

ఇట్లానతిచ్చిన ప్రభువువారి కోరికతీరునటుల నేనీకాశీక్షేత్రమున ప్రవేశించి కార్యముల నిర్వర్తించితిని. చూడుడు; అస్ఖలితబ్రహ్మచారులమనుకొనువారు, తపస్వులమనుకొనువారు, దండిపండితులమనుకొనువారు, ధూర్తులై భోగముకొంపలలో దూరుచున్నారు. పట్టిచూడగనిలువరాని బూటకములబన్నుచు నీతిచెడి గృహస్థులువర్తించుచున్నారు యతుల తపోవనములన్నియు యువతీయువకుల లీలోద్యా

నముతైనవి. ఇక్కడ బోడిసన్న్యాసులు భోగాలకై దేవులాడుచు "హోహో" అని ఛీకొట్టువారలవెంటదగిలి పరువులిడుచున్నారు. సర్వమును తారుమారైపోయినది. ఇదంతయు నామహిమయే. (చూచి) అదిగో గంగానదిని దాటి ఎవడో వచ్చుచున్నాడు. వానియందు అభిమానము మెండుమెండుగనున్నది. లోకత్రయమును మింగునట్లున్నాడు. బొబ్బలిడుచు బెదరించుచున్నాడు. తనప్రజ్ఞకానందించి నవ్వుకొనుచున్నాడు. ఈతడు దక్షిణదేశమునుండి రానోపును. పూజ్యుడగు మాతాత అహంకారుని వృత్తాంతము విచారించెద.

(అహంకారుడు ప్రవేశించుచున్నాడు.)

అహం:— సరస్వతి—ఆది.

1. ఛీ ఛీ ఛీ ఛీ జగమున నందఱు చెనటులు, మూర్ఖులు పశువులహో॥

నేనెఱిగించిన శాస్త్రము నమ్మరు
సితులు బల్కుచు నుందురుగా ఛీఛీ॥

2. ప్రభాకరుని బోధలను వినరూ
పాశుపతంబును గోరరుగా
అభాగ్యులీజనులెల్లు తెలింతురో
ఆగమములనే చెఱచిరిగా॥ ఛీఛీ॥
బోడిగొట్టుకొని జడలు పెంచుకొని
భువి సన్న్యాసుల మందురుగా
జాడ నెఱుంగని ఈ మతిభ్రష్టులు
సన్న్యాసమునే చెఱచిరిగా॥ ఛీఛీ॥

ఓహో! ఈ జగమంతయు మూర్ఖమయియున్నది ఎట్లందురా? గురుమతము వినబోరు; కుమారిల శాస్త్రరీతిని గానరు; ప్రభాకరుని బోధకు చెవియొగ్గరు; ఇంక దేవతాగము కథ ఎత్తనేల? శేషుని భాగ్యముకోరరు. ఈ నరపశువులు సూక్ష్మపదార్థతత్త్వములను గ్రహింపచూడరు. పాశుపత మతమును తలపునరానీరు. (చూచి) వీరా? జ్ఞానశూన్యులగు వేదాధ్యయనపరులు; అర్థమెఱుంగక వేదము

లను నీటగలుపుచున్నారు. (మరొకతట్టుచూచి) వీరు కేవలము భిక్షుల కొఱకై యతివేషముల వేసినవారు. కొందఱు తలల గొరిగించుకొనినారు; మఱికొందఱు జడల బారుగ పెంచుకొనినారు. ఈ కపట భిక్షులు పవిత్రశాస్త్రమును పాడుచేసినారు. (వేఱొకవైపుచూచి) కష్టపడి తర్కమును నేర్చిన శైవపాశుపతాదులు వీరు. ఈపాషండులు కేవల పశువులు! వీరితో మాట్లాడుటే పాతకము. (ఇంకొకచోట చూచి) అదిగో గంగానదీతీరమున చిత్రాసనములపైని కూర్చుండి, దర్భలను చేబూని అక్కడక్కడ దేవుడుపెట్టెలను పెట్టి తాళముల ద్రిప్పుచు జపముల సాగించినారు. ధనికులను ద్రోచు నేర్పు వీరి కెంతయుకలదు. (మరలనొకవైపుచూచి) అరెరే! ఏమి వీరి దాంభికము! ఎత్తగు గడలమీద సన్నని వలువలను వేనవేలుగా ద్వారముకడ ఆరగట్టినారు. క్రింద కృష్ణాజినముల పఱచి కూర్చున్నారు. దాపున సన్నెకల్లు, యజ్ఞపాత్రలు, రోళ్లు, రోకళ్లు, సమిధలప్రోవులు కాన్పించుచున్నవి. పేరు ఎండ తెగకుండ నిప్పులలో పడబోయు నేంఱు పొగలు గ్రక్కుచు ఆకసమునకు ఎగసి, మబ్బులై సూర్యుని కప్పుచుండెను. ఇదొక దొడ్డ గృహస్థుని మందిరమైయుండును. అతి పవిత్రముగ చూపట్టు ఈ చోటున, రెండుమూడు దినములుండుటకు, నాకు వసతి చిక్కునేమొ విచారితుగాక. (ప్రవేశించి చూచి)

ఆహా! ఉదరమున, రొమ్మున, భుజములందు, కొండలందు, పెదవులమీదను, చెక్కిళ్ళమీదను, కంఠమునను, నొసటను, వీపునందును, గడ్డమునందును, మెండుగ నామములుపెట్టి, చేత దర్భలు పూని అతి దంభరూపముతో ఒక పురుషుడు కానవచ్చుచున్నాడు. విచారింతుగాక. (సమీపించి) శుభమస్తు! శుభమస్తు! నీకు మేలు కలుగు గాక!

(దంభుడు హుంకరించి అదల్చును. వటుడు ప్రవేశించును.)

వటు—ఓ బ్రాహ్మణుడా' దూరముగా నిలు. కాళ్లైన కడుగక ఈ పుణ్యాశ్రమములోనికి వచ్చితివా?

అహం—ఏమి, అట్లు అడుచెదవు? కటా! నేనెక్కడనో పాపిష్ఠి మూర్ఖదేశము వచ్చినాను; ఇచ్చటి గృహస్థులు శ్రోత్రియులైన అతిథులకు అర్ఘ్యపాద్యాదులనిచ్చి ఎదుర్కొనరేమి?

వటు—(దంభుడు సైగ చేయగా అహంకారునితో) ముసలిబాపడా! ఏమట్లుల తొందరపడెదవు? దూరదేశమునుండి వచ్చిన మీ కుల శీలములను విచారించుమని, మా గురువుగారు ఆజ్ఞాపించుచున్నారు.

అహం—ఏమీ! ఇప్పుడు మాకులమును శీలమును కూడ పరీక్షింపవలయునా? సరే, వినుము. భూలోకములో ఉత్తమము గౌడదేశము. అందునుత్తమము రాధికాపురము. అందుత్తములు గౌడబ్రాహ్మణులు. ఇక నాసంగతి,

క. జననియు త్రి సకల సద్గుణ
ఖని; జనకుడు పుణ్యచరిత కలితుడు; వంశ
మ్మును కనమకీర్తి దాయక
తనయుడనే నమ్మ; తండ్రితల తన్నగలన్.

వటు—దేవా! పాదముల కడిగికొనుడు.

అహం—(తనలో) ఈరుల్లను కాళ్లైనకడుగడే! కానిమ్ము, నేనె కడుగుకొందును. [కాళ్ళు కడుగుకొని దంభుని సమీపింపబోవును.]

దంభు—(పండ్లు పటపట కొఱుకుచు) నీవు దూరముగా నిలువుము. నీ చెమట గాలిలో కలిసి మామీదికి రాగలదు.

అహం—ఓహో! ఈ బ్రాహ్మణ్యము అపూర్వముగ నున్నదే?

వటు—ఓ బ్రాహ్మణుడా! అందుకు సందేహమేమి? శ్రీవారిసన్నిధికి మహారాజులు సయితము వచ్చునప్పుడు, వారు మాగురుసత్తముల పూజ్యపాదముల తాకక, శ్రీవారి పీఠికడ, నేలను తాకునట్టుల శిరము వంచుచు, తమ కిరీటస్థమణి కాంతులతో నీరాజనము లిత్తురు!

అహం.—(తనలో) ఈదేశము కేవలము దాంభికులకుతగినది. కానిమ్ము. ఈపీఠమున కూర్చుండుదును. (అని దాపుననున్న పీఠముపైని కూర్చుండబోవును.)

వటు—(అడ్డమువచ్చి) ఆరాధ్యపాదుల వారి ఈపీఠమున ఇతరులు కూర్చుండతగదు.

అహం—ఓరీ శుంఠా! పాపాత్మా! దక్షిణరాఢా దేశవాసులము, సుప్రసిద్ధులమయిన మావంటి పవిత్రులు సయితము ఈపీఠము నంటతగదా? ఓరీమూర్ఖా! మాకులశీలములనీకను వినుము. నామాతమహాకులీన, నాతండ్రి అతిపావనమూర్తి, నాతండ్రి కన్నను నేను పూజ్యుడను. నాసతి శ్రోత్రియ పుత్రి, సుశీల. అయినను పూర్వమొకప్పుడు నాభార్యయొక్క అన్నకు మిత్రు డగు ఒకానొకని కూతురుమీద అపబద్ధపునింద అణుమాత్రము గుసగుసలలో సూచింపబడగా, ఆఅప్రఖ్యాతపు బాంధవ్యమును సహింపనిచ్చలేక నాప్రియపత్నిని పరిత్యాగముచేసిన పరమ పావనమూర్తిని! ఇసుమంతయు ఎఱుంగక ఈసునపలుకుదువే!

దంభు—ఓ బ్రాహ్మణుడా! అదంతయు నిజమే కావచ్చును. అయినను నీకు మావృత్తాంతము తెలియదుగదా. మునుపొకసారి, నేను బ్రహ్మపురికి పోగా, మునివరులెల్లరు ఎదురేగివచ్చి పూజ లర్పించిరి. బ్రహ్మదేవుడును సన్మానించియు ప్రేమభాషణములతో మన్ననచేసి, ఆవుపేడతో అప్పుడు శుద్ధిచేసిన తనతొడలపైని నన్ను కూర్చుండబెట్టుకొనినాడు!

అహం—(తనలో) ఏమి! ఈ దాంభిక బ్రాహ్మణుని అతిశయోక్తులు! ఇతడు ఒకవేళ దంభుడేమో! అయినంగానిమ్ము (కోపముతో) ఓరీ! మూర్ఖా నీవేల గర్వపడెదవు?

మ. అవిచారంబుగఁ బ్రేలెదేమిటికిరా, అస్మత్ప్రభావంబుగా
నవు. బ్రహ్మములనంగ నెంత! ఋషిసంతానంబు లక్కేమి? స్వ
ర్గవిభుప్రాభవమెంత? ఇట్లు పలుకంగా నేల? కోట్లాదిగా
సవితృ బ్రహ్మ సురేంద్రులే నిలువనీ, జంకింతు దృష్టాంతరిస్ఫ

దంభు—(సంతోషముతో) ఓహో! మీరు నాపితామహులైన అహంకారులు దేవా! లోభుని కొమరుడ దంభుడనువాడ మీకు నమస్కరింపుచున్నాడను.

అహం—వత్సా! చిరాయుష్మంతుడవు కమ్ము! నేను ద్వాపారయుగాంతకాలమున నిన్ను చూచియుంటిని. అప్పుడు నీవు బాలుడవు. ఇప్పుడు నేను ముసలిని. మఱియు చిరకాలము ఎడబాసియుండుటచేతను నిన్ను తిన్నగా గుఱుతు పట్టజాలనైతిని. నీకుమారుడు అసత్యునకు కుశలమా?

దంభు—అతడు క్షేమముగానే యున్నాడు. అతడును మహామోహమహారాజుగారి ఆజ్ఞానువర్తియై ఇక్కడనే యున్నాడు. వానిని విడిచి నేనొక్క క్షణకాలమైన ప్రాణములు నిలుపజాల.

అహం—నీతల్లిదండ్రులు తృష్ణయు లోభుడును క్షేమముగనున్నారా?

దంభు—వారును ఇక్కడనేయున్నారు. అందఱును క్షేమమే.

అహం—మంచిది. త్వరలోనె ఎల్లరను కలిసికొందును.

దంభు—పూజ్యులరగు తమరు ఇక్కడికి ఏమి పనిమీద దయచేసి నారో?

అహం—వత్సా! వివేకునివలన మహామోహునకు ఏమో ఉపద్రవము కలుగనున్నదని విని ఆవృత్తాంతము తెలియగోరి వచ్చి యున్నాను.

దంభు:—తమరాక మేలైనది. మహామోహమహారాజుగారు ఇంద్రలోకమునుండి, నేడో రేపో, ఇచ్చటికేరానున్నారని విన్నాను. శ్రీవారు ఈ కాశీనగరముననే రాజధానిగా వాసముచేయ నిశ్చయించిరని లోకప్రవాదము పుట్టినది.

అహం:—సర్వజీవులందును వాసముచేయు మహామోహుడు, ఈ వారణాశియందు నివసించగోరుటకు కారణమేమిగానుండును!

దంభు:—మఱేమున్నది? వివేకుని ప్రయత్నములను ఎదిరించుకొఱకే. ఈ కాశి శాశ్వత బ్రహ్మపురిగదా! విద్యాప్రబోధోదయములకు

జన్మభూమి యిది. కులవినాశనమునకు పూనుకొనిన అలవివేకుడు ఇక్కడ నెలవుకూర్చుకొనియున్నాడు.

అహం:—(భయముతో) ఓహో! అతులయినపక్షమున మనపక్షము వారు తీవ్రప్రతీకారము సాగించుట ముఖ్యావసరమే. త్రిపురాసురుల వధించిన శివుడు, ఈకాశీనగరమున జ్ఞానశూన్యులకును, అవసానకాలమున తారకమంత్రోపదేశము చేయుచుండును.

దంభు—అది సత్యమే. అయినను కామము క్రోధము మదము కలవారలకును, భక్తిలేనివారికిని అది లభించుటలేదని తీర్థప్రజలు చెప్పుకొనుచున్నారు.

(తెర లో)

నగరజనులారా! శ్రీ శ్రీ మహామోహమహారాజుగారు వచ్చుచున్నారు. హెచ్చరిక!

దంభు—మహారాజుగారు ఇప్పుడే వచ్చుచున్నారలట. ఎదురుగ పోవుదము. (నిష్క్రమింతురు)

(పరివారసహితముగా మహామోహమహారాజు ప్రవేశించును.)

మహా—గీ. అప్పుగొనిగాని దొంగిలియైనగాని
జిహ్వ కింపగుదాని భుజింపవలయు;
కంటి కింపైన కాంతను కలియవలయు;
వెఱ్ఱి మోక్షపు బాటలు వెదుకనేల?

(నవ్వి) ఉహో! మూఢులు నిరంతరులుగదా! జగమున దేహము కంటె వేఱుగ ఆత్మయొకటి కలదట! పరలోకమునందు ఎన్నడో అది ఫలముల కాంచునట! ఈమాట ఆకాశపుష్పము తియ్యని పండై మారును అని, దాని మధుర రసమును అనుభవింపవచ్చునని, భ్రమలు పెంచుకొనుటవలె నున్నది. కొందఱు ప్రబుద్ధులు ఇటువంటి లేనిపోని కల్పనలచేత తమ దుష్పాండిత్యమును చూపి లోకమును వంచించుచున్నారు. ఈ ఆస్తిక ద్రోహులను తునుమాడవలయును. దేహ

మునకు భిన్నముగానుండు జీవుని ఎవరేని చూచిరా? లేనికులములను కల్పించియు, స్వ పర భేదములచే కొందఱిని పరాంగనలని రూపించియు, వారిని తాకరాదంచు హద్దులు ఏర్పఱచియు, నిష్పురుషులు తామెట్లో బ్రతుకచూచుచున్నారు. వాచస్పతి "పృథివి వాయువు ఆపస్సు తేజస్సులే తత్త్వములనియు, అర్థకామములు మాత్రమే పురుషార్థములు, గార్హపత్యమే ప్రధానాశ్రమమనియు, భూతలమే జ్ఞానజనకమనియు, పరలోకము లేనే లేదనియు, స్వాత్మ్యవే మోక్షమనియు" నాసిద్ధాంతములనే శాస్త్రముగ రచించి చార్వాకుని ద్వారమున, శిష్యోపశిష్యమార్గమున లోకమునకు చక్కగ బోధించుచున్నాడు.

(చార్వాకుడును శిష్యుడును ప్రవేశింతురు)

చార్వా—వత్సా! జ్ఞప్తియుండెగదా! దండనీతియే విద్య. దానిలో అంతర్భూతములైనవే సుబోధలెల్లను. వేదత్రయము ధూర్తుల ప్రలాపములు. చూడుము, ద్రవ్యనాశన క్రియవలన యజ్ఞములు చేయువారికి స్వర్గఫలము వచ్చునేని, కార్చిచ్చువలన కాలిపోవు చెట్లు ఎన్నిఫలరాసులనో ఒసగవలసి యుండును. యజ్ఞమున జంపబడు పశువునకు మోక్షమబ్బుట సత్యమగునేని, 'యజ్ఞకర్త' తనతండ్రినే యజ్ఞమునందు సమర్పించి సులభముగా వానికి ముక్తినేల నొసంగరాదు? చచ్చిన వారికి శ్రాద్ధములు తృప్తినిచ్చుచో, ఆరిపోయిన దీపమునకు చమురు పోసినప్పుడు అదియు తృప్తిపడి ప్రకాశించవలయును గదా! ఇట్టి వాదనలు అనుభవదూరములు. వట్టిదబ్బరలు.

శిష్య—ఆచార్యా! మీరానతిచ్చు ప్రకారము పురుషులకు తినుటయు త్రాగుటయునే పరమార్థమగునెడల ఈ తైర్థికులు సంసారసుఖములను విడిచి దుఃఖప్రదములగు వ్రతములను పూనుటెందుకు?

చార్వా—వంచకులు కల్పించిన శాస్త్రములచేత మోసపోయి, మూర్ఖులయి, పండుతినగలమనుఆశనే, పండుతినుటనేడు అను

భవముగ భ్రమించి వింతగ తృప్తులగుచున్నారు. తీర్థాలవెంట తిరుగు ప్రజలు నానాకష్టాలుపడి ఆ కష్టాలే సుఖాలని భ్రాంతులై చెప్పుకొనుట చూడవా?

శిష్య—దుఃఖమిశ్రితములుగాన సంసారసుఖములు త్యాజ్యములని తైర్థికులు చెప్పుదురు.

చార్వా—(నవ్వి) ఆ నరపశువుల దుర్బుద్ధికి ఏమందును? లోకమున దుఃఖమిశ్రములని ఇంక యే సౌఖ్యములను విడువవలయునను వారు శుద్ధమూర్ఖులు. ఊక యుంటుందని బియ్యమును విడిచి వేయుమందురు కాబోలు ఆమూర్ఖులు!

మహా—ఓహో! చిరకాలమునకు దివ్యములగు ధర్మవచనములు చెవుల బడినవి. ఎవరబ్బా? (చూచి, ఆనందముతో) నాప్రియసఖుడు చార్వాకుడా!

చార్వా—మహారాజాధిరాజా! ఇదె చార్వాకుడు నమస్కరించు చున్నాడు.

మహా—కలిరాజునకు కుశలమా?

చార్వా—దేవర వారి ప్రసాదమువలన సర్వత్ర కుశలమే. కలిరాజు కార్యశేషమును కూడ పూర్తిచేసి దేవర పాదముల సందర్శనమునకు త్వరలో రానున్నాడు.

మహా—కలిరాజు ఏమేమి చేసియున్నాడు?

చార్వా—దేవరయాజ్ఞను దాదాపు సఫలము గావించినాడు.

సీ. వేదపారాయణవృత్తి ఛాందసులైన
విప్రజనమ్ము కన్పింపరాదు;
తత్వశాస్త్రార్థవాద ప్రౌఢి వెలిగించు
వెడగు పండితుల సందడులు లేవు;
హోమాగ్నిశిఖలు స్వాహాకారముల రేపు
యాజ్ఞకజనము మాయమయిచనిరి;

శమదమాదులతో నేస్తమున కట్టుబడియున్న
సాధనపరులు వాసనకు లేరు;

గీ. ఏ కొలదిగా జనమ్ము గాడెనేని వారు
పిచ్చిబాపలు, పిఱికి వెఱ్ఱివారు;
అప్రతీచ్య త్తరాల విద్యాప్రబోధ
చంద్రులుదయింపనట్టి సూచనలు లేవు.

దేవరవారు కలనైన భయపడవలసినపని లేదు. కాని దేవర వారికి మనవి చేయవలసినది ఒకటి ఉన్నది.

మహా—అది ఏది?

చార్వా—విష్ణుభక్తి అను యోగిని ఒకతె కలదు. ఆమె సంచారములు కలిగా అరికట్టినాడు. అయినను ఆమె అనుచరులను మేము తేఱిపాఱ చూడనైన శక్తులము కాకున్నాము.

మహా—(భయముతో, తనలో) ఈమె ప్రభావము చాలగొప్పది. స్వభావముచేతనే మాకును ఈమెకును ద్వేషము. కానిమ్ము. (చార్వాకునితో) మనకు ఈశంకతో పనిలేదు. మన కామ క్రోధాదులముందు దానిఆటలు సాగజాలవులే!

చార్వా—అల్పమగు ముల్లైనను పాదమునంతను బాధించగలదు. బుద్ధియంతను చీకాకుపఱచగలదు. అట్లే అల్పశత్రువైనను బాధ నొందే.

మహా—ఎవరక్కడ?

ద్వారికుడు / అసత్సంగుడు — (ప్రవేశించి నమస్కరించి) చిత్తము.

మహా—నీవుపోయి, కామ క్రోధ మద మాన మాత్సర్యాదులు అందఱితోను నామాటలుగా ఇటుల చెప్పుము!

"ఏమఱక విష్ణుభక్తిని ఎక్కడచిక్కినఅక్కడ హతము చేయుడు. మరలనాఆజ్ఞకై వేచియుండనక్కఱలేదు. ఇట్లు మీకందఱకును ప్రత్యేకాధికారము ఇచ్చుచున్నాను" — పొమ్ము.

అస——చిత్తము మహాప్రభో! (నిష్క్రమించును)

(ఒకపురుషుడు ఉత్తరమును తెచ్చును)

పురు——దేవా! జయము, జయము! ఈ ఉత్తరమును దేవరవారు చిత్తగించవలయును. (ఉత్తరము నందించును)

మహా——(ఉత్తరమును తీసికొని) చార్వాకా! నీవనులందు కడు జాగ్రత్త!

చార్వా——చిత్తము. (నిష్క్రమించును.)

మహా—— (పురుషునితో) నీవు ఒకింత వేచియుండుము.

పురు——చిత్తము, చిత్తము; మహాప్రభో (నిష్క్రమించును)

మహా—— (ఉత్తరమును ఇట్లు చదువును) "స్వస్తి! శ్రీ వారణాశీపుర వరాధీశ్వరులయిన, త్రిలోకనాథులయిన, శ్రీమన్మహారాజ రాజాధిరాజ రాజపరమేశ్వరులయిన, శ్రీశ్రీశ్రీ మహామోహ మహారాజులవారి దివ్యపాదపద్మములసన్నిధికి, శ్రీ పురుషోత్తమాలయమునుండి మదమానులు సాష్టాంగదండప్రణామ సహస్రంబులర్పించి, వినయమొప్ప నివేదించుకొను విన్నపము. ఇక్కడ మేము నిరంతర క్షేమముతోడ నున్నారము. తరువాత శాంతిదేవి తన తల్లియైన శ్రద్ధాదేవితోగూడి, వివేకుని పక్షమున దూతికయై, ఉపనిషద్దేవిని వానితో కూర్చుటకు తీవ్ర ప్రయత్నముల సాగించుచున్నది. వీరి రహస్యచర్యలు నిగూఢములు. కాముని సాహచర్యమును విడిచి ధర్ముడు, రహస్యముగా వైరాగ్యాదుల సహవాసము చేయుచున్నట్లు అనుమానముగా నున్నది. ఈ సంగతులను దేవరవారు దివ్యచిత్తానకు తేవలయును."

(క్రోధముతో) ఔరా! ఈ ముగ్గురు శాంతికి భీతిలుచున్నారు. మాపాలిటి మృత్యుదేవతవలె ఈ శాంతి ఎందు జనించినది? ధర్ముడు కాముని అంటి పట్టుకొని యున్నచో మేలే, వీడుపోయి వైరాగ్యాదమునితో చేరినాడే! (ప్రకాశముగా) ఓరిసేవకా!

పురు—(ప్రవేశించి) చిత్తము మహాప్రభో! ఏమి ఆజ్ఞ.

మహా—నీవుపోయి కామునితో ఇట్లు చెప్పుము. ధర్ముని సత్వరము బంధింపుమనుము. ఒకప్పుడు మిత్రుడుకదాఅని సందేహించవలదనుము.

పురు—దేవర సెలవిచ్చినట్టుల చెప్పెదను. (నిష్క్రమించును.)

మహా—(ఆలోచించి తనలో) శాంతిని సాధించుటకు ఇంక ఉపాయమేమి?—ఉపాయాంతరముతో పనిలేదు. దీనికి క్రోధలోభులే సమర్థులు. (ప్రకాశముగా) ఎవరక్కడ?

ద్వా—దేవా! ఏమియాజ్ఞ?

మహా—ఇప్పుడేపోయి క్రోధుని, లోభుని తోడ్కొనిరా.

ద్వా—చిత్తము. (నిష్క్రమించును)

మహా—మనమిప్పుడు వేగిరపడనుగూడదు, వేగిరపడకుండను ఉండరాదు.

(ద్వారపాలకుడు ప్రవేశించి)

ద్వా—దేవరవారికి జయము జయము.

మహా—ఆక్రోధాదులెక్కడ?

ద్వా—దేవరవారి ఆజ్ఞలను తెల్పితిని. ఇదిగో ఒక్క క్షణములో రానున్నారు బయలుదేరి యుందురు.

మహా—మంచిది. (తనలో) అక్కడ రహస్యాలోచన మందిరమున అహంకారాదులు నాకై వేచియుందురు పోయివచ్చెద.

(నిష్క్రమించును.)

(క్రోధుడు లోభుడు ప్రవేశింతురు.)

క్రోధు—విష్ణుభక్తి శ్రద్ధ శాంతి, వీరు మహారాజుగారితో వైరముపూనినారని విన్నాను. నేను జీవించియుండగనే, తమ ప్రాణముల మీదికి వచ్చెడు పని వీరికేల? నీవు ఏమిచేయుదువందువా?

గీ. ఆలి తమ్ముల బాధింప జాలిపడదు,
పితృహింసకు వెనుకంజ వేయఁబోదు,
మాతృవధకైన నింతో ననుమానపడదు,
నేను మదిలోన ఆవేశించు మానవుండు.

లోభు—కావచ్చును—ప్రియురాలా! తృష్ణాసతీ! ఇటురమ్ము.

తృష్ణ—(ప్రవేశించి) ప్రాణేశ్వరా! ఏమి ఆజ్ఞ!

లోభుడు—ప్రాణేశ్వరీ! చూడుము. పొలములు, గ్రామములు, తోటలు, పట్టణములు, రాజ్యములు, సప్తసంతానములు, అనేకము వానిపైని ఆశలచే బంధించి ప్రజలకు ఎక్కడను శాంతి చిక్కకుండ చేయుచున్నాను. ఇదంతయు నీ అనుగ్రహము చేతనే లే. మఱి నీవేమిచేయుచున్నావో చెప్పుము.

తృష్ణ—ప్రాణనాయకా! నేను ఊరకున్నానా? మీకాసందేహము వలదు. నేను మమకారాభిమానములను అంతులేకుండ పెంచుదును. సప్తసంతానాలు త్రిలోకాధిపత్యాలు మహేంద్రసంపదలు ఎవరికిని తృప్తిని కల్గింపనీయను. మీదలువవలన బ్రహ్మాండమంతయు లభించనీ, కాని, బ్రహ్మాండకోటులే వచ్చిపడనీ తృప్తిపడనీను. ఆశాగ్నిజ్వాలలపడి మ్రగ్గవలసినదే ఎల్లరును.

క్రోధు—అటులనా? ప్రాణప్రియా! హింసావతీ! ఇటురమ్ము.

హింస—(ప్రవేశించి) నాథా! నన్నుపిలిచిన పనియేమి?

క్రోధు—ప్రియురాలా! నీవు సహధర్మచారిణివి అగుటచేత, నాకు పితృవధ సంయితము సుకరమైనది. నాకు పిశాచి,మాత ఎంతటిది? సోదరులో కీటకములే! సర్వబంధువులును వధ్యులుగనే తోచుదును. ఇక అన్యులమాట చెప్పవలయునా? దుష్టవ్యభిచారులు నాకు నచ్చిన మిత్రులు. వారినిని హతముచేయుచునేయుందును. నా హృదయమున కోపజ్వాలలు ఎగసి జ్ఞాతివర్గమును సంయితము నాశము చేయువఱకును చల్లారవు. నీమహిమను కొంత వివరింపుము. వీరు విందురు.

**హింస**—పగలు కలిగి పొగలుగ్రక్కు కోపాగ్నిలేచు సమయము లందు మీరిన్నిపనులను చేయుదురు నేను విలాస సమయములందును ఘాతుక కార్యముల సాగించుచుందును!

క్రోధు—అవునౌను, విందముచేయుము బలే!!

హింస— ర్తన – శ్రీ మాస్నో ఆది.

1. నామహిమ వినుడీ వారు నయముమీర తెల్పెదను
2. ఎంబదాతేలు నా। జాతులు భక్తవరులు సుమ్మీ
తల్లి నాంచారమ్మ జాతర। తొండన సట్టంబు నాకు॥నా॥
3. కే వేసపోట్లఖనను మేకలను నఱకుటయే
నాకు తగిన భక్తులకు। న్యాయమని దెల్పుచుందు ॥నా॥
4. కోడిగొంతు తెఱక మని। కోసి పోలి పోలియటంచు
నేడుగా నాదుముందు। వేడ్కమీర నూచుచుందు।నా॥
5. ద్రవే నకొక్క గున్నతల। ఎత్తిపడన [illegible]కుచుండ
నాటినంతో మిఋచప్ప। నాకసాధ్యమా నేడు? ॥నా॥
6. కడిపందెములను మరి। గొప్పగ వెయింతు నేను
చూడకిన్నులుండవా। చోద్యమౌను వాని తెంపు!॥నా॥
7. చెఱువు లెంకజేసి అరుగు। చేపలను జంపుచైతు
కరుణనాకు సవతి, దానికన్నుబాము చుంచుచేతు.॥నా॥

నా ప్రభావము ఇంకను ప్రవలయునా?

క్రోధు—అక్కఅయ్యాడగు చాలు! చాలు! అరుగో మనప్రభువులు! వారి దర్శనము చేకొందము.

(మహామోహమహారాజు గారు ప్రవేశింతురు.)

అందఱు—(సమీపించి) ప్రభువులు మహామోహమహారాజుల వారికి జయమగుగాక! జయమగుగాక!

మహా—మాకు శత్రువులయిన శ్రద్ధమాతురగు శాంతిని మీరు బంధించవలయును సకలమును మీ కిదివరకే తెలుపబడి యుండెగదా? ఆలసించకుడు. పొండు

అందఱును—చిత్తము, చిత్తము. దేవర ఆజ్ఞపరిపాలనము చేసెదము.

(నిష్క్రమింతురు)

మహా—ఆహా! శ్రద్ధకూతురనుటచేత, నా మనస్సునకు ఒకమంచి ఉపాయముతోచుచున్నది. శాంతి తనతల్లియైన శ్రద్ధపైని నిరంతరము ఆధారపడియుండును. కాబట్టి ఏచమత్కారముచేతనైనను శ్రద్ధనుబంధించి, ఆమెను ఉపనిషత్కాంత సమీపమునకు పోజాలకుండ చేసితిమా, మనకార్యము గట్టెక్కినట్లే! అప్పుడు మాతృవియోగముచేత,కోమలస్వభావయగుశాంతియు కృశించి తనంతతానే నశించును. శ్రద్ధనుభంగపెట్టి పట్టుటకు నాస్తికతాసతి పరమసమర్థురాలు! ఈపనికి ఆమెనే నియోగింతుగాక. (ప్రక్కకుచూచి) విభ్రమావతీ! నీవు సత్వరముపోయి నాస్తికతాదేవిని సత్వరము తీసికొనిరమ్ము.

విభ్ర—(లోపలినుండియే) చిత్తము మహాప్రభూ!

(నాస్తికతాదేవితో విభ్రమావతి ప్రవేశించును)

నాస్తి—సఖీ! చిరకాలమునుండి మహారాజుగారి ముఖము చూడకుంటిని. అందుకైనన్నిప్పుడు దేవరవారు ఎగ్గులాడుదురేమో నని భీతిలుచున్నదానను.

విభ్ర—సఖీ! ఎంతవెఱ్ఱిదానవు? నీముఖసందర్శన మాత్రముననే ఒడలు మఱచు మహారాజుగారు నిన్నుఎగ్గులాడుట కూడనా?

నాస్తి—అది పూర్వపుమాట సఖీ! ఇప్పటి నా బూటకపు సౌభాగ్యమును చూచి నీవు పరిహాసము చేయుచున్నావా!

విభ్ర—పరిహాసమా! నీ సౌభాగ్యమును ఆతడు కల్లగా చూడగలడా? అటుల తలంచబోడసి నీ కిప్పుడే తెలిసిపోవును. సఖీ! నిద్రచాలక నీ కన్నులు కలత నొందినట్లున్నవి. నిద్ర కొఱవడుటకు గారణమేమి?

మహా—ఏల ఈ ఆలస్యము? నాస్తికతాదేవి రాదే!

నాస్తి—సఖీ! ఒక్క మగడుగల మగువకే నిద్ర దుర్లభమగుచుండ, మగలు పెక్కండ్రుగల నాకెటులుండును!

విభ్ర—ఆ మగలెవరు ?

నాస్తి—ఈ మహారాజొకడు. ఆ పంయిని కామ క్రోధ లోభ మద మాత్సర్యాలు. అహంకారుడు, దంభదర్పాదులు, అతి విస్తార మెందులకు ? పీఠ పంటెమున పుట్టిన మగవాడు పసివాడైనను ముసలివాడైనను ముదసలియైనను కేయింబవళ్లు ఒక్కడును నన్ను విడిచి యుండబోడు.

విభ్ర—సఖీ ! కామునికి రతీదేవియు, క్రోధునికి హింసాపతియు, లోభునకు తృష్ణావతియు, ఇట్లు వారివారికి స్వీయభార్యలు ప్రియురాండ్రు కలుగుగదా ! ఆ నీ సవతులకు నీపైని కినుక జనించుట లేదా ?

నాస్తి—సఖీ ! కినుక అని పలుకుచువేల ; వారు మాత్సరము వహించుటకు మారుగా, వారు సంయుతము నన్నే ఆశ్రయించుచు నన్ను విడిచి క్షణమైన వేఱుపడి మనజాలరు.

విభ్ర—సఖీ! నీ సౌభాగ్యమును చూచి, సర్వజ్ఞమిని మనోవ్యాకులత పొందదగిన నీ సవతులు, నీ అనుగ్రహమును కోరుచుండుట చేత, పుడమిని నీవంటిసౌభాగ్యవతి లేదు, లేదు అని చెప్పవలయును గదా! ఇంకొకమాట. ఈవిధముగా నిద్రలేక కలతచెందిన హృదయముతో, తొట్రుపడు కాళ్ళ అందియల గొదలతో, దఱిచేరు నిన్నుచూచి మహారాజుగారు శంకింతురేమొ గదా?

నాస్తి—అట్టి శంక నీకువలదు. మహారాజుగారి ఆజ్ఞానుసారమే నేనీ గతి వర్తించుచున్నదానను. అదిగో! శ్రీవారిని సమీపింతును.

(విభ్రమావతి నిష్క్రమించును.)

మహా—ఓహో! ప్రాణప్రియా! నన్ను కౌగిలించుకొమ్ము! రమ్ము!

నాస్తి—(చిరునగవుతో అటుల చేయుచున్నది)

మహా—ఓహో! మునుపు ఎన్నడో నావయసుకాలమున నేను నీవలన అనుభవించిన సుఖైకరసామృతము జ్ఞప్తికి వచ్చుచున్నది!

ఈప్రకారముగానే ప్రకాశితమగు అంగరాజితో సర్వత్ర సంచరించుచుండుము సరేగాని, ఆ దుష్టాత్మురాలు శ్రద్ధఅనునది, ఉపనిషత్కాంతను వివేకునితో కలుపుటకై దూతికయైనదట! అది మనకు ప్రతికూల; పాపులమైత్రిని మెలంగు మూర్ఖమతి. కులగౌరవమును వమ్ముచేయుచున్నది. కడుతుచ్ఛదాత్మురాలు. ఆ రండను కొప్పుపట్టి యీడ్చితెచ్చి పాషండుల వశముసేయవలసియున్నది. పూనికవహింతువా? వేడికొనువాడ!

నాస్తి.—ఇంతమాత్రపుపనికి ప్రభువువారు నన్ను వేడికోవలెనా? మాటసూచనమాత్రాననే దేవరవారిసంకల్పము ఈసేవకురాలికి తెలిసిపోయినది. ఆమెదౌత్యము మనకొంపముంచును. ఆమె మీ సోదరియేకదా!

మహా.—అయిననేమి? క్షేమంకరము కానప్పుడు, స్వపరపక్షవిచక్షణతో మనకు అక్కఱలేదు.

నాస్తి.—ఆమెను నేర్పుమెయి, ఉపాయముతో వశముచేసికొనజూచెదను. సాధ్యముకాదా హతముచేసెదను.

మహా.—కాలవిళంబనము కూడదు సుమా!

నాస్తి.—ఇప్పుడేపోయి "ధర్మము బూటకము; మోక్షగాథ కల్పితము, వేదమార్గములు కల్లలు; సుఖభంగకరములగు శాస్త్రబోధలు దబ్బరలు; స్వర్గఫలములు భ్రమాకల్పితములు." అనిచక్కగా నిరూపించి బోధించి, సహేతుకముగ రుజువులుసూపి, ఆ శ్రద్ధను శీఘ్రకాలములోనె వేదవిముఖురాలిం జేసివేసెద. ఇక ఉపనిషత్తుమాట చెప్పనేటికి? ఈ వేదాంతిని మనకుప్రాణాంతకయే! విషయానుభవ దూరమగు మోక్షానుభూతియన గోతపుట్టు నటుల చేసి, శ్రద్ధ ఉపనిషత్తుమాట తలపెట్టనైన నొల్లకుండ చేసెద. ఇందుకై దేవరవామ నన్ను అభినందించుటకు ఎంత కాలమో వేచియుండ నగత్యములేదు.

మహా—ఏమిచేయుదువో! గాని ఆధారపడియుండువాడ

కమాజ —ఆదితాళం

1. నాకాజ్ఞనొసగునాధా, నేటాలుగు ||నాకా||

2. వేదశాస్త్రంబులు, వినరాదటంచును
బోధచేసెదను నేను, భువినంతటను ||నాకా||

3. ధర్మము ల్లబ్బఱ దానము ల్లెబ్బఱ
దయచాల పాపమంచూ, నమ్మింగె నూ. ||నాకా||

4. భగవంతుడే లేడూ, పాప ఋక్కడొంచూ
తగినట్లు బోధింతునూ, అందఱకూనూ.

5. ఏ నుండ నీకేల యింతయోచనసేయ
మానుమూ మదినిచింత, ఇదియొకవింతా ||నాకా||

అల వివేకుని సంయితము ఒక ఊపు ఊపెద ఇప్పు డంతయు చెప్పనేల?

మహా—ప్రాణప్రియా! నీమాటయే ఫలసిద్ధి. ధన్యోస్మి! కృతజ్ఞుడ, కృతజ్ఞుడ విలాసార్థము ఒకింత వనవిహారమున కేగుదము.

(నిష్క్రమింతురు.)

---

# ప్రబోధచంద్రోదయ

## నాటకము.

## తృతీయాంకము.



( శాంతియు, కరుణయు ప్రవేశింతురు. )

శాంతి— నాథ. ఆది.

(1) ఎటుబోయితివో ఇటు నను వీడి
కటకట నే నిను గాంచగలనే ||ఎటు||

(2) శ్రద్ధామాతా పాతక మానవు
లిద్ధర నిన్ను హింసల బెట్టిరో ||ఎటు||

(3) ఒక నిమిషమునీ వుండవు నను వీడి
అకటా నేడీ యాగడమేమో ||ఎటు||

హా! మాతా! శ్రద్ధాదేవీ! ఎక్కడనున్నావు? నీప్రియదర్శనము నాకొక్కసారి ఒసగుము. మృగముల భీతి తొలగించు కార్యములందు నిమగ్నవై వెడలితివా? దేవపూజలు జరిపింప చనియుంటివా? సన్మాని నివాసములందును, భజనమందిరములందును, ముదమున దిరుగులాడు నీవు, చండాలవాటులందుండు గోవువలె పాషండుల గృహమునందు నేడు ఎటుల కుందుచుంటివో కదా! నన్ను మఱచి నీవెన్నడును భోజన మజ్జనాదుల స్వీకరించి ఎఱుగవే, నీరైన త్రాగవుగదా! కటా! నీ వింకను బ్రతికియుందువమ్మా?—సఖీ! కరుణా! నా తల్లిని వీడి నేను నిముసమైన మనజాల. నా నిమిత్తము సొదపేర్చుము. నిప్పు రగుల్చుము. అగ్గిలో చొచ్చి నాదుఃఖతాపమును చల్లార్చుకొందును. అచిరకాలములో నా జననిని కలిసికొందునుగాక!

కరుణ:—(కన్నీటితో) ఓసఖీ! ... కఠోరములగు నీవిలాపములును, అగ్నిజ్వాలలబోలు నీశోకరవములును నాగుండియ లవియ చేయు చున్నవి. నాప్రాణములు ఎగసిపోవుచున్నవి. ప్రియసఖీ! ఊరడిలుము. ముహూర్తకాలము ధైర్యము చిక్కబట్టుము. ఇంతలో మునిజనాశ్రమము లందును, భాగీరథీ తీరస్థతీర్థము లందును, అందందు నిపుణముగా వెదకివత్తును. ఒకవేళ మహామోహుని దారుణప్రయత్నముల తెలిసి, తప్పించుకొని పోయి, రహస్యముగా ఎందేని దాగియుండవచ్చును.

శాంతి:—సఖీ! ఏటిపేరాశలు! నీవారధాన్యమున్న తిన్నెలందును, దర్భదుబ్బులుగల దిబ్బలందును, సెలయేరుల జాలులందును, పుణ్యనదీతీరములందును, పూజాపరుల గృహములందును, మునిజనయజ్ఞవాటులందును, నాలుగాశ్రమములవారి నివాసము లందును వెదకి వెదకి వేసారి వచ్చితి. ఎందును శ్రద్ధామాత మాటయైన వినరాదయ్యె. ఆమెనోడు స్మరించువారే లేరు. ఇంకెక్కడి అడియాసలు?

కరు—సఖీ! నేను చెప్పెడిదానిని వినుము. ఆ శ్రద్ధామాత సాత్వికురాలుగదా! ఆమెకు అటువంటి దుర్గతి పట్టునని నేను నమ్మజాలను. ఆమెవంటి పుణ్యాత్మురాలికి ఇటువంటి ఆపదలువాటిల జాలవు.

శాంతి—ఓ చెలీ! విధి ప్రతికూలుడైనప్పుడు సంభవింపరాని ఆపద ఉండదు. అల సీతాదేవి రావణునివలన పడరాని పాట్లుపడె గదా! ద్రౌపదీసతి రాజసభామధ్యమున పరిభవముల పాలు కాలేదే? సతీదేవి తండ్రివలననే అవమానములపాలై ప్రాణముల పాయవలసివచ్చెనుగదా! బ్రహ్మదేవుని చేష్టలు విపరీతములుసుమీ! కానిమ్ము. మనము ఇప్పుడు పాషండుల ఇండ్లకడనే వెదకుదము.

కరుణ—అలాగున చేయుదము. (ఇరువురును కొంత నడతురు) సఖీ! శాంతీ! అటు చూడుము; అటుచూడుము! ఆ రాక్షసుడెవడు?

ఒడలుకారుచున్న మలధారలతో, కన నసహ్యాముగ నున్నాడు. వ్రేలాడు జడలు, దిసమొల, వికృతాకారము! చేత నొక నెమలి పింఛము తాల్చినాడు.

శాంతి—సఖీ! వీడు రాక్షసుడు కాడు. మిగుల బలహీనుడుగనున్నాడు. పిశాచమని శంకించెదను.

కరు—ఆకాశమున సూర్యభగవానుడు ఇట్లు దేదీప్యమానముగా ప్రకాశించుచుండ పిశాచము లెట్లువచ్చును? వీడు ఇప్పుడే నరకకూపమునుండి వెలువడి వచ్చుచున్న ఎవడో నరకలోక వాసి అయియుండును.

శాంతి—(నిదానించిచూచి) ఆహా! తెలిసినది. మహామోహునిచేత పంపబడిన దిగంబర సిద్ధాంతుడు వీడు. వీనినుండి మనము దాగి యుండవలయును.

(ఇరువురును దాగుదురు. దిగంబరసిద్ధాంతి ప్రవేశించును)

దిగంబ—తొమ్మిది ద్రోవలతోనొప్పు దేహమును మందిరమునగల దీపమో అనునటుల ఆత్మ ప్రకాశించుచుండును. ఈ ఆత్మను గురించి జినవరుడుచేసిన బోధయే ముక్తిప్రదము.

(శబ్దము ఆకాశమునుండి) ఓ శ్రావకురాలా! వినుము!

గీ॥ లలితగుణులార! శ్రావకులార! వినుడు,
మలమయ శరీరముల నెన్నిమార్లు కడిగి
శుద్ధమొనరింపఁ గలరాత్మ శుచికిదారి
ఒక్కటేసుమీ; ఋషిపాద యుగళసేవ.

ఋషిపరిచర్య ఎట్టిదనుచున్నారా? చెప్పెదను, వినుండు. ఋషివరులరావించి వారి పాదములకు శిరమువంచి నమస్కరించ వలయును. ఇష్టాన్నభోజనములతో తృప్తిపఱచవలయును. సకలవిధ ముల వారి కోర్కులుతీర్చి సంతుష్టుల చేయవలయును.

దిగం—బాగుబాగు అదిగదా ఋషిసేవాధర్మము. మోక్షప్రద

మార్గము. (తెరవంకఁ జూచి) ఓ శ్రద్ధా! ఇటు రమ్ము! (శాంతియు కరుణయు భయముతో చూచుచుందురు. శ్రద్ధ ప్రవేశించును)

శ్రద్ధ—ఓ రాజబాంధవా! ఏమి సెలవు?

శాంతి—(మూర్ఛిలుచున్నది.)

దిగం—శ్రావకసముదాయమును నీవు ఒక్కక్షణకాలమైనను విడిచి యుంపతగదు. నిరంతరము వారిని అలరించుచు నీ వశమున నుంచుకొను నేర్పు చూచుచుండవలయును.

శ్రద్ధ—దేవర ఆజ్ఞానుసారము వర్తింతును.

(నిష్క్రమించును.)

కరుణ—ఓ ప్రియసఖీ! ఊరడిల్లుము. ఊరడిల్లుము. నామమాత్రము చేత నీవిట్లు భయపడకూడదు. పాషండులయొద్ద సంయుతము శ్రద్ధయొకతె కలదని మున్ను అహింసవలన వినియుంటిని. ఆ యువతి తమస్సుయొక్క కూతురట. ఈమె ఆ తామసీశ్రద్ధ అయి యుండును.

శాంతి—(ఊరడిల్లి) సఖీ! అవునవును. ఇది ఆతామసీ శ్రద్ధయే అయి యుండును. తల్లికై పరితపించు నేను, పేరు విన్నమాత్రననే తల్లడిల్లిపోతిని. ఈదురాచారను సదాచారగను, ఈకురూపిని సురూపినిగను భ్రమపడి దీనినే నాకూరిమి జననిగా దలచితిని.—కానిమ్ము. మనము శ్రద్ధామాతకై బౌద్ధులకడ వెదకుదము. (ముందుకు నడతురు. పుస్తకహస్తుడై బుద్ధాగముడు భిక్షురూపముతో ప్రవేశించును.)

బుద్ధా—(ఆలోచించి) ఓ ఉపాసకులారా! విషయవాసనలు అంటకుండిన యెడల, విషయానురాగము నశించును. విషయానురాగము లేనివారియందు ధీపరంపరలు తప్పక ప్రకాశించును. క్షణభంగురములగు పదార్థములు బుద్ధికల్పితములే అయ్యును కనుభ్రమసి శాశ్వతములట్లను, బాహ్యమున స్థిరతరముగ

నుండుననిగను తోచును. వానిని సరకుగొనరాదు యథేచ్ఛగా పురుషుడు వర్తించనోపును. దేనికిని బానిసకాదగదు. భోగముసు మోక్షమును రెండును చేరియున్న ఈ బౌద్ధధర్మము ఎంత మేలైనది! సుందర మందిరముల నివసింపవచ్చును; విలాసినీవతులకూడవచ్చును. అభీష్టపదార్థములననుభవించవచ్చును. మృదుశయ్యలందు నిదురించవచ్చును; ఇవన్నియు అసత్యములనిమాత్రము ఎఱుంగవలయును.

కరుణ—సఖీ! కాషాయవస్త్రములు మీదినుండి వ్రేలగా, అంటగొరిగిన తలమీది జుట్టుపిలక అల్లలలాడగా, పొడవుగ తాటిచెట్టువలె ఈ పడుచువాడెవడో ఇటు వచ్చుచున్నాడు.

శాంతి—వీడు బుద్ధాగముడు.

బుద్ధా—(ఆకసమువంకచూచి) ఓ ఉపాసకులారా! ఓ భిక్షువులారా! భగవంతుడగు బుద్ధుని వాక్యామృతమును వినుడు. (పుస్తకమునుండి చదువుచున్నాడు)

ద్వి॥ సులువుగా ఐహిక సుగతి దుర్గతుల
తిలకించుచుందును దివ్యనేత్రముల.
సకల సంస్కారముల్ క్షణికంబులయ్యు
ప్రకట వేగాస్పష్ట వలయముల్ తిరిగి
నిత్యంబుగాదోచు, నీ ఆత్మకూడ
సత్యమ్ముగాలేదు; సర్వమనృతము.

దిగం—(తెలివంకచూచి) ఓ శ్రద్ధా! ఇటురమ్ము.

శ్రద్ధ—(ప్రవేశించి) రాజబాంధవులవారి ఆజ్ఞఏమి?

దిగం—ఉపాసకులను భిక్షువులను కూడ నీవు తడవుగ ఆలింగనము చేసికొనుచుండవలయును. ఏమంటివు.

శ్రద్ధ—దేవర ఆజ్ఞానువర్తినై యుందును. (నిష్క్రమించును)

శాంతి—ఈమెయు ఆ తామసీ శ్రద్ధయే! తడవతడవకు వేషము మార్చుచున్నది.

కరు—అవును అవును అదియే.

దిగం—(బుద్ధాగమునితో) ఓరీ! భిక్షుకా! ఇటురమ్ము, నిన్నొకప్రశ్న అడుగవలయును.

బుద్ధా—(కోపముతో) ఓరీ! పాపపిశాచా! అట్లు అఱచెదవేల?

దిగం—ఓరీ! కోపము మానుము. అహింసాపరులకిట్టి తామసమా? నేనొక శాస్త్రవిషయము అడిగెదను.

బుద్ధా—ఓ క్షపణకా! నీవు శాస్త్రంగూడవ కూడ ఎరుగుదువా? అడుగుము. ఏమడిగెదవో?

దిగం—మీ బుద్ధసిద్ధాంతము నీవు క్షణవినాశివని చెప్పుచున్నది. ఇక నీవు ఎవరినిమిత్తము ఈ భిక్షుకవ్రతము పూనినావు?

బుద్ధా—అదియా నీసందియము? వినుము. మాసిద్ధాంతము ననుసరించువాడు, ఒకానొకడు, క్షణిక విజ్ఞానమును పొంది, వాసనాబంధముల త్రెంచుకొని ముక్తుడుకాగలడు.

దిగం—ఓరీమూర్ఖా! ఏదో మన్వంతరమందు, ఎవ్వడో ఒకడు ముక్తుడు కాగలడని, క్షణికజీవియగు నీవు, ఆవ్రతము పూనుటవలన ఏమిప్రయోజనమును పడయగలవు? ఇంకొకమాట! ఇటువంటి ధర్మమును ఉపదేశించిన వాడెవడు?

బుద్ధా—ఈధర్మమును ఉపదేశించినవాడు సర్వజ్ఞుడగు బుద్ధ భగవానుడు.

దిగం—ఓరీ! బుద్ధుడు సర్వజ్ఞుడా? నీకెట్లు తెలియును?

బుద్ధా—ఓయీ! బుద్ధుడు సర్వజ్ఞుడని మాబుద్ధాగమము వలననే ప్రసిద్ధము.

దిగం—ఓరి బుద్ధిహీనుడా! అతనికి అతనిమాటలే ప్రమాణములై సర్వజ్ఞత్వము సిద్ధించునెడల, నేనును సర్వజ్ఞుడనే. మఱియు నీవును, నీతండ్రితాతలతో ముప్పదితరముల వారును నాకు దాసులు సుమీ!

బుద్ధా—ఓరీ! పాపపిశాచా! మలపంకధరా! నేను నీకు దాసుడనా?

దిగం—ఓరి దుష్టభిక్షుకా! నీ వాదనకు ప్రతివాదన తెల్పినానురా. ఇక ఎవరిమాట వారికి యోగ్యతను కూర్చును అనబోకు. నీకిప్పు డొక ప్రియవాక్యము చెప్పెదను. వినుము. నీ బుద్ధమతమును ఇక విడిచివేయుము. మా అర్హత శాసనమును అవలం బించుము. దిగంబర వ్రతమును పూనుము.

బుద్ధా—ఓరి పాపాధముడా! నీవుపాడగుటేగాక ఇతరులను కూడ పాడుచేయ చూచుచున్నావటరా? పిశాచత్వమును లోక నింద్యమును అగు నీ ధర్మమును ఎవడుకోరుకొనునురా?

కరుణ—సఖీ! అటుచూడుము. పుర్రెలు, ఎముకలు ధరించివచ్చు చున్నాడు! వాడెవడు?

శాంతి—వాడు కాపాలిక మతస్థుడు. సోమసిద్ధాంతుడనువాడు.

(కాపాలిక వేషముతో సోమసిద్ధాంతుడు ప్రవేశించును)

సోమ—నరుల ఎముకలు హారములుగా వేసికొని, పుర్రెలను పాన పాత్రలు చేసికొని, స్మశానమె నివాసముగ నిర్ణయించుకొని, ఉగ్రసాధనలు చేయ నాకు దివ్యాంజనము లభించినది. ఈశునకును విశ్వమునకును భేదములేక ఏకమే అని తెలిసి పోయినది.

దినిం—ఓహో! కాపాలికుడు ఒకడు వచ్చుచున్నాడు. వీనిని పరీక్షిం చెద. ఓరీ! నరాస్థికపాలధారీ! నీధర్మము ఎట్టిది? నీ మోక్ష మెటువంటిదో చెప్పుము.

సోమ—ఓరీ! క్షపణకా! అటువకు, చెప్పెద. శ్రద్ధతో వినుము. నాధర్మమిది: వసాదులతోగూడినమాంసమును అగ్నిలో వ్రేల్చె దను. బ్రహ్మకపాలములో సురనుంచి త్రాగెదను. అర్హకంఠ ములద్రుంచి అరక్తధారలతో భైరవునకు బలులర్పింతును.

దిగం—(చెవులుమూసికొని) అర్హత అర్హత! ఘోరపాపకారి ఎవడో ఈ బుద్ధిహీనుని మోసగించినాడు!

సోమ—ఓరిపాపాత్మా! పాషండాధమా! ఈ పదునాల్గులోకములను సృజించి, పెంచి, లయముకావించు మహాశివునా నీవు మోసగాడనుచున్నావు? ఆదేవదేవుని ధర్మమహిమవినుము. అనుభవముచే చెప్పుచున్నాను. నాప్రజ్ఞ చూతువా? త్రిమూర్తులను నాయిచ్చకొప్పున త్రిప్పగలను. సూర్యచంద్ర నక్షత్రగ్రహముల గతులను మార్చివేసెదను.

దిగం—ఓరి! కాపాలికా! అందుచేతనే నిన్నెవడో ఇంద్రజాలికుడు మోసగించెనంటిని.

సోమ—ఓరి! పాపీ! పరమేశ్వరునే ఇంద్రజాలికుడనుచున్నావా? మరల ఇట్లాక్షేపణల పలికితివా, (కత్తి వరనుండితీసి) దీనితో నీకంఠమును ఇప్పుడే ఖండించి, కాళీమాతకు అర్పణచేతును.

బుద్ధా—అహింస పరమధర్మమన్నారు పెద్దలు. ఓ మహానుభావా! వినోదార్థముగాజరిపిన వాగ్వాదనను బట్టి కత్తిపోటులకు దిగుటయా? శాంతింపుము. శాంతింపుము.

దిగం—మహానుభావా, నీఘోర కోపమును శాంతింపజేసితివా, నిన్నింకొక ప్రశ్న అడిగెదను.

సోమ—(కత్తిని ఒఱయందుపెట్టి) అడుగుము. అడుగుము.

దిగం—మీ ధర్మమేమొ కొంత తెలిసినది. మీ మోక్షమెట్టిదో ఒకింత చెప్పుము.

సోమ—విషయానుభోగములు లేనిది ఆనందము ఎవరికిని కలుగబోదు గదా! కొందఱు చెప్పుతీరున విషయానంద విమూఢదశయే మోక్షమగుచో అట్టి పాషాణముక్తిని కోరుకొను పామరుడెవడుండును? స్త్రీని భవానినిగను, తనను శివునిగను భావనచేసి పురుషుడు పరమసుఖముల గాంచుటే ముక్తి.

శాంతి—పాపము శమించుగాక! పరమపావన వైరాగ్యమూర్తియగు విశ్వేశ్వరుని పేర ఎట్టి పాడుమతమును కల్పనచేసిరోగదా!

కరుణ—ఇదంతయు అలమహామోహుని ప్రచారఫలము. ఈ నాడెందు చూచినను సమస్తసంప్రదాయముల వారును, వానికింకరులై పోవుచుండిరి. సత్యమతము ఎన్నటికైన విజయమందక తీరదు లే!

బుద్ధా—మహానుభావా! నామనవి ఒకటికలదు. భోగములు వీడని వారికి ముక్తిగలుగదని అన్నిమతములును పలుకును.

దిగం—రాగము వీడనివాడు ముక్తుడగుట వేదవిరుద్ధము.

సోమ—(తనలో) అయ్యో! పాపము! శ్రద్ధశూన్యమై వీరిమనస్సులు చెడియున్నవి. (తెఱవంకచూచి, ప్రకాశముగా) ఓ శ్రద్ధా! ఇటురమ్మా! నీవు అవలంబించిన కాపాలిక ధర్మమహిమచూప వలసియున్నది.

శ్రద్ధ—(ప్రవేశించి) వచ్చినదానను దేవర ఆజ్ఞఏమి?

కరుణ—సఖి! తమస్సు కూతురైన ఈశ్రద్ధను బాగుగ చూడుము. నల్లకలువ రేకులవంటి కాటుక కండ్లతో, వికృతాలంకారములు గల తలకట్టుతో, జీరాడు వస్త్రములతో వయ్యారములొలుక త్రిప్పులాడుచు వచ్చుచున్నది!

గీ. పునుక దండలాడ పుట్టుమ్ము వ్రేలాడ
అవికెజార కేశరాజిచెదఱ
వెఱగు పుట్టునడల వెడలివచ్చెడి దీని
గానఁదగదు పుణ్యమానినులకు.

సోమ—ప్రియురాలా! ఈ భిక్షుకుడు దురభిమానిగానున్నాడు. వీనిం గౌగిలించుకొనుము. (శ్రద్ధఅటుల చేయును.)

బుద్ధా—(ఒడలుమఱచి) ఓహో! ఏమి ఈకాపాలి నీసుఖస్పర్శ! మున్ను ఎంతమంది రండలనో కౌగిలించుకొంటిని. బుద్ధభగవానుని తోడుగా, నూరుపార్లు శపథముచేసి చెప్పగలను. ఈ ఆనందముతో ఎదియు సరిరాదు. ఓహో కాపాలినీ చరితము! పరమపావనము. సోమసిద్ధాంతము మహాశ్లాఘ్య

మైనది. ఈ పరమేశ్వర అను శాసనమును ఇప్పుడే స్వీకరించె దను. ఓ సోమసిద్ధాంతి తిలకా! నేను ఇప్పుడే నీకు శిష్యుడ నైతిని. నీవు నాగురుడవు!

దిగం—ఓరీ భిక్షుకా! నీవు కాపాలినీ స్పర్శచేత మైలబడినాడవు. దూర ముగ నుండుము. ఇది భ్రష్టురాలు!

బుద్ధా—ఈ పరమపవిత్రురాలి ఆలింగన మహోత్సవము కానక నీవు అటుల వదఱుచున్నాడవు.

సోమ—ఓ ప్రియురాలా! నీవిప్పుడు ఈ క్షపణకుని కూడ ఆలింగనము చేసికొనుము. (శ్రద్ధఅటులచేయును.)

దిగం—(గగుర్పాటుతో) ఓహో! అర్హత అర్హత! ఏమి ఈ నిరతి శయానందమహిమ! (కొంత ఆలోచించి పశ్చాత్తాపపడు వానివలె, తనలో) ఏమిజరిగినది? అయ్యో! నేను గొప్ప ఇంద్రజాలమున చిక్కి మోసపోతిని. ఏమిగతి? ఏమి ఉపా యము? ఈ నెమలిపింఛముతో కప్పుకొనెద.

శ్రద్ధ—(పింఛమునులాగికొని, వానిని విసరుచు) మిత్రమా? ఏమి అల్లు లోటు)పడుచుంటివి ?

దిగం—సోఁబడితి పూర్వవాసనలు విడువలేక అర్హతిని. మరల నీ అనుగ్రహము వలన తెలివివచ్చినది. కాపాలికశాస్త్రము మహోత్తమమైనది. అదొక్కటే భోగమోక్షప్రదము. ఆచార్యా! సోమసిద్ధాంతాగ్రణీ! నేను నీ శిష్యుడను. నీ మహాభైరవాను శాసనమున ఇప్పుడే చేర్చుకొమ్ము.

సోమ—కూర్చుండుడు ధ్యానముచేయుదము.

(అందఱునుకూర్చుండి కంఠములూయుదురు సోమసిద్ధాంతి ఒక పుఱ్ఱచేతబూని ధ్యానము నభినయించును. శ్రద్ధ ఆ పుఱ్ఱను సారాయముతోనింపి, తానును కూర్చుండును.)

సోమ—చూచితిరా ! సురలు ఈ పాత్రమును సురతో నింపిరి.

(కొంత త్రాగి దిగంబరసిద్ధాంతికిని బుద్ధాగమునికిని ఈ బోవుచు)
ఇది పరమపావనము అమృతతుల్యము ఇది పాపహరము ముక్తిప్రదము శ్రీపరమేశ్వర ప్రసాదితము.

బుద్ధా—మా బౌద్ధసిద్ధాంతము సారా త్రాగ నంగీకరింపదు.

దిగం—కాపాలికుడు ఎంగిలి చేసిన కల్లునా త్రాగుట ?

సోమ—(రహస్యముగా) శ్రద్ధా ! ఏమిఆలోచించుచున్నావు ? వీరికి ఇంకను పశుత్వము వీడలేదు. నా ఎంగిలి దోషమట ! పూజ్యురాలా ! దీనిని నీవుకొంత త్రాగి వారికిమ్ము.

శ్రద్ధ—దేవర ఆజ్ఞానుసారము చేసెదను. (సురను కొంత త్రాగి బుద్ధాగమునికిచ్చును.)

బుద్ధా—స్త్రీలనోరు సదా శుచియని శాస్త్రము. ఇది మహాప్రసాదము.మహాప్రసాదము! నేను ఎన్నెన్ని పానీయములనో త్రాగినాను ఈ కాపాలినీ చుంబితమైన ఈసారాయము, అహో ! అమృతతుల్యము ! కాదు కాదు, అమృతమే ! అమృతమే !

దిగం—ఓసీ! మూర్ఖా ! అంతయు నీవే త్రాగెదవా? కాపాలినీ వదనోచ్ఛిష్టప్రసాదము అంతయు నీకొఱకే అనుకొంటివా? (పాత్రను లాగికొని త్రాగుచు ) ఓహోహో ! ఈ మద్యముయొక్క మాధుర్యం ఏమనిచెప్పుదు! మదురం, మదురం, మధులం దీని పర్మళం అసమానం! దేవత్లు దీనికోషం నాతో పోరొత్తురేంమొ ! నాకు కపిత్తం వత్తుంది!

నాధనామక్రియ - ఆది.

1. కల్లుముంతా మాయమ్మ నిను ఇడువజాలనే

2. ఆకాసమ్మా బూదేవతా అట్టిట్టాతుందే

నీవంఠనున్న జాలు నాకు కొండలు పిండౌనే ॥క॥

బుద్ధా—కూ కపిత్తం!

3. బుద్ధిలేని సాదువులైతే ముట్టరుగా నిన్ను

నీవొద్దవున్నచాలు మాకు సర్గములెందుకే? ॥క॥

దిగం— 4. కొంప గోడుపో తెపోయె కొదువేముందమ్మా
సీతుంపరైనా చాలు నాకు సంపదలున్నట్లే ॥౪॥
సోమ— 5. కాపాలీ సీసోటిపసాదం కమ్మనగాయుందే
ఆకమ్మని కల్లు వ నమసేసిన కైపుమజాగుందే ॥౫॥

దిగం—భిక్షుకా! అన్నా అన్నా! నా ఒడలు తిరుగుచున్నది: ఘూ! ఘూ ఘూ! పట్టుకో. పట్టుకోరా! (పడిపోవును)

బుద్ధా—నాతలాత్తిర్గి పోతుంది. అరే అరే! ఎక్కడికి పోతావ్. తలా? వుండు వుండు. (తలపట్టుకు పడిపోవును.)

సోమ—సెబాష్! ప్రియులారా! మనకిప్పుడు ఇద్దఱు దాసులు దొరికినారు. ఇకమనము నృత్యము చేయుదము.

(నృత్యము సాగింతురు.)

కరు—కటకటా! ఎట్టి బుద్ధధర్మము, ఎట్టి ఋషిసేవాసంప్రదాయము! వీరలు ఎట్టుల భ్రష్టము చేసిరోగదా!

శాంతి—ఇంక విశుద్ధమతా చరణకు గతులులేవు.

దిగం—ఓ భిక్షుకా! యీకాపాలికుండు- కాదు - కాదు. మన ఆ ఆ సాద్దు, కాపాలిక్ తోను త్తా! మ నం క లు త్తాం. చిందు లేత్తాం!

బుద్ధా—బలే బలే! లే లే సూత్తా వేం? లే లే

(అందఱు గంతులు వేతురు.)

సోమ— (కొంతసేపటికి) మిత్రములారా! మనము కార్యము మఱచితిమి. మనమందఱుము మహామోహ మహారాజుగారి కింకరులముకదా! వారి ఆజ్ఞాప్రకారము సత్వపుత్రికయగు శ్రద్ధను చెఱపట్టవలసియున్నాము.

బుద్ధా—ఆ తొత్తుకూతులు! ఎక్కుందో సెప్పు. కొప్పుపత్తు పట్టి ఈడ్సుకొత్తా!

దిగం—నేను చెప్పుతాగా. గణితంవేసి తెలుప్పుతాన్నాడు.
(బలపము పలకగొని లెక్క వేయును)

శాంతి—సఖీ! ఇక మనము హతాశులము. వీరిప్పుడు మాతల్లి శ్రద్ధా దేవిం గూర్చి ఆలోచించుచున్నారు.

కరుణ—పాపము శమించుగాక! వీరేమనుకొందురో వింద్దము; కొంచెము తాళుము.

దిగం—అశ్రద్ధ ఇప్పుడు జలంలోలేదు, స్థలంలోలేదు, పర్వతాలిలో లేదు, తీర్తాలలోలేదు, స్వర్గపాతాళ్లలోలేదు.

బుద్ధా—మరెక్కడుంది ?

దిగం—కొందర్ తాపసుల్ ఎదల్‌లో ఇష్ణుభక్తిని అండసేసోకని దాగింది.

కరుణ—సఖీ! నీవు భాగ్యశాలినివి. శ్రద్ధామాత విష్ణుభక్తినిదేలి శరణమున ఉన్నది. ఇంక దిగులువలదు.

సోమ—మఱి ధర్ముడో! వీడు కాముని విడిచి పాఱిపోయి ఎక్కడనో దాగినాడట.

దిగం—(మరల గణితము వేసి) వాడును ఇష్టుబకితినే ఇప్పుడాసరించి సరిప్పుడాడు.

సోమ—అక్కటా! మన మహామోహ మహారాజుగారికి గొప్ప చిక్కొవచ్చినది. ఆ విష్ణుభక్తిబలే సమర్థురాలు! మహారాజు గారికి ఆమెపేరుచెప్పిన అడలు జనించును. సత్వకుమారి శ్రద్ధ మనవారిని తప్పించుకొని పోయి ఆ విష్ణుభక్తితో చేరినదిగా ? కాముని విడిచిపోయిన ధర్ముడును వారితోచేరినాడా? వీరందఱి కుతంత్రాలవలన వివేకునికార్యము గట్టెక్కునా ఏమి ? ఎంత మందబుద్ధిని! మనము ఇంతమంది ఉండగా భయమేల ? మన

ప్రాణములు పోయినను సరియే, స్వామికార్యమును నిర్వహించ వలయును. ఆ ధర్మ్మని శ్రద్ధను పట్టితెచ్చుటకై మహాభైరవ విద్యను ప్రయోగించెదను.

బుద్ధా—దిగం—సిత్తం ! సిత్తం !

శాంతి—సఖీ ! వింటివిగదా వీరిప్రసంగము ! వీరి దురుద్యోగమును గురించి ముందుగపోయి, విష్ణుభక్తిదేవికి మనవి చేయుదము.

(అందఱు నిష్క్రమింతురు.)

# ప్రబోధచంద్రోదయ

## నాటకము.

## చతుర్థాంకము.



(మైత్రి ప్రవేశించును.)

మైత్రి—మహాభైరవివాత బడకుండ ధర్మునితోపాటు నాప్రియసఖయైన శ్రద్ధను విష్ణుభక్తిదేవి కాపాడెనని ముదితవలన వింటిని. నాప్రియసఖిని నేను ఎక్కడ కలిసికొనగలనో?

(శ్రద్ధ ప్రవేశించును)

శ్రద్ధ—(నలుదిక్కులు పరికించి) కాపాలికుని ఘోరరూపు తలంపునకు వచ్చుచో వానిని ఇప్పుడు చూచినటుల భీతిచే వణకుపుట్టుచున్నది.

మైత్రి—(తనలో) నాప్రియసఖి శ్రద్ధాదేవి భయసంభ్రమములతో భ్రాంతయగుచున్నది.

ఉ. గాడుపు పిల్లలాగడము గాఁ బడవేయునురన్నభీతి నూ
గాడుననంటికొమ్మ బలెనై, మెయి యెల్ల వణంకుచుండె; నట
చూచియు రిచ్చపోయె కనుచూపుల తత్తరపాటుకూడె, ఏ
కీడులు రావుగా ప్రియసఖీమణి కీశ్వర! భద్రదాయకా!

కటా! దాపునకువచ్చినను నన్ను గుర్తింపకున్నది! (ప్రకాశముగా) ప్రియసఖీ! శ్రద్ధా! ఇదేమి? మిగుల మనస్తాపముచెంది, నన్నుసంయిత ము చూడకున్నావు?

శ్రద్ధ—(చూచి) ఓ ప్రియసఖీ! మైత్రీ! మహాక్రూరవ్యాఘ్రమునోటపడి, మరల ప్రాణములతో ఈజన్మయందే నిన్ను చూడగల్గితిని!

రమ్మా, రమ్మా! నన్ను కౌగలించుకొమ్మా! ఆభైరవి మరల వచ్చుటలేదుగదా?

మైత్రి—(కౌగిలించుకొని) సఖీ! విష్ణుభక్తిదేవి ఆభైరవియొక్క ప్రభావమును అడంచివేసినను, నివింకను వడంకుచున్నావు? ఆ భైరవి ఏమిచేసినది.

శ్రద్ధ—సఖీ! ఏమిచెప్పుదు? ఆకసమునుండి వేగ డిగ్గివచ్చి, కోడిపిల్లలను తన్నుకొనిపోవుతెన్నున, భైరవి పైబడి, నన్నొకచేతను, ధర్ముని ఒకచేతను గట్టిగపట్టుకొని ఎగసిపోయినది!

మైత్రి—అకటకటా! (మూర్ఛిల్లబోవును.)

శ్రద్ధ—సఖీ! ఊరడిల్లుము.

మైత్రి—(తెలివితెచ్చుకొని) తరువాత తరువాత?

శ్రద్ధ—తరువాత నా బొబ్బరింతలు విని దయార్ద్రహృదయ యయి విష్ణుభక్తిదేవి మహాభయంకర రూపముతాల్చినది. కోడపైని పిడుగుపడిన తీరున, భైరవీశక్తి పైనిబడి దానిని తుత్తునియలుగ నఱికి నేలకూల్చినది.

మైత్రి—ప్రియసఖీ! దైవవశమున పులినోటినుండి తప్పింపబడిన లేడి కూనవలె బ్రతికివచ్చితివి! తరువాత, తరువాత?

శ్రద్ధ—తరువాత విష్ణుభక్తిదేవి "ఔరా! ఈ మహామోహుడునన్ను సయితము అవమానింప సంకల్పించెగా!—నీవు తత్‌క్షణముపోయి వివేకునితో నాయాజ్ఞను ఇటుల తెలుపుము: 'ఓ వివేకా! నీవు కామక్రోధాదులను ఇక ఉపేక్షింపతగదు. వారిని నిర్జించు కార్యమును తత్‌క్షణముపూనుము. వైరాగ్యాభ్యుదయము తప్పక కలుగనున్నది. నేను సమయమువేచి ప్రాణాయామాదుల ప్రోత్సహించి, సుశిక్షితుల జేసి నీసైన్యమును అనుగ్రహింతును. శాంతిమున్నగు వారలు నేర్పుతోడ వర్తించి ఉపనిషత్కాంతను తోడ్తెచ్చి నీకు కూర్తురు. ప్రబోధచంద్రోదయమునకు సమ

యము అనుకూలముగ మారనున్నది.' అని సెలవిచ్చినది. (కొంతనడచి) కావున నేనిప్పుడు వివేకుని కడకు పోవుచున్నాను.

మైత్రి—అక్కచెల్లెండ్రము మేము నల్వురమును విష్ణుభక్తి దేవిఆజ్ఞచేత వివేకుని కార్యసిద్ధికొఱకై పుణ్యపురుషుల ఆత్మలందు నివసించెదము. కరుణ ముదిత ఉపేక్షయు ఆప్రయత్నము మీద నేయున్నారు. నీవు వివేకుని ఎక్కడకాంచగలవు?

శ్రద్ధ—విష్ణుభక్తిదేవి నాకిట్టుల చెప్పినది. రాఢా దేశమున భాగీరథీ తీరమునందు, చక్రతీర్థము కలదు. అక్కడ మీమాంసానుగతమైన మతీదేవితోడ కాలము గడపుచున్నాడు. ఉపనిషద్దేవి కొఱకై అహర్నిశము తపముచేయుచున్నాడు.

మైత్రి—అటులైన నీవు అచటికి సత్వరము పొమ్ము.

(నిష్క్రమింతురు.)

(వివేకుడు ప్రవేశించును)

వివే—

నాదనామక్రియ, రూపకము.

1. ఈ వియోగ మెటుభరింతు, ఎపుడునాదు రమణిగాంతు?
తాళజాలమదినియెంతో, తాపమతిశయించె నాహా ॥ఈ
2. ఉపనిషత్ కాంతామణి నా, హృదయరాజ్యలక్ష్మిలేక
విపులదుఃఖ భరముచేత, వివశమయ్యె మనసు నేడు ॥ఈ
3. కర్మఠులు మీమాంసులు, కఠినశిలా హృదయులగుచు
మర్మభేదమైనయట్టి, మాటలాడిరనుచు వింటి! ॥ఈ॥
4. ప్రాణప్రియా, ఎట్టివెతల, బడితివో నన్బాసినావు
ప్రాణమునకు ప్రాణమైన, పరమసుధా హృదయవుగా
॥ఈ॥

కటకటా! వియోగదుఃఖములచే కుందువారి నెందఱెందఱినో గేలిచేసియుంటిని. ధర్మోపన్నము లెన్నిటినో పలికియుంటిని. నాకుసదా

(ప్రకాశముగా) సేవకా! ఆమెను తోడ్కొనిరమ్ము.

(సేవకుడు నిష్క్రమించి నాస్తికతాదేవితో ప్రవేశించును)

సేవ—అదుగో దేవరవారు.

నాస్తి—దేవా! వందనశతములు. భగవత్కరుణవలన అభీష్టసిద్ధి కలుగుగాక.

వివే—నాస్తికతాదేవీ! క్షేమమా? అందుకూర్చుండుము.

నాస్తి—నాకిప్పుడు కూర్చుండు పాటి తీరిక లేదు. అవసర విషయముల గూర్చిమాట్లాడి పోవచ్చినాను.

వివే—అట్లైన చెప్పుము!

నాస్తి—మనము ఏకాంతమున నుంటిమిగదా?

వివే—సేవకా! నీవు ఆవలనుండుము, పిలిచిన వత్తువుగాక.

సేవ—చిత్తము. (నిష్క్రమించును.)

నాస్తి—దేవా! చెప్పుదును. మహామోహునితోడి వైరము సాధించి విజయమును కోరుచుంటిగదా?

వివే—జయమో అపజయమో వైరమునాగుచుంట ప్రసిద్ధమేకదా?

నాస్తి—నీమేలుకోరి చెప్పుచున్నదానను అతడు మూర్ఖుడు. ముక్కుకు సూటిగా పోయినవానిని దునుమాడవలెనుట కల్ల. నేనొక ఉపాయము చెప్పవచ్చితిని.

వివే—నీవాక్కులు వింతగనున్నవి వానిమీదనీకిట్టి తృణీకారమేల?

నాస్తి—అతడిప్పుడు నాచెలియలు మంజువాణివలలోజిక్కి నన్ను ఉపేక్షించుచున్నాడు. ఇంతేకాక మొన్న న్నైవానిని సమీపింప నన్ను ప్రత్యక్షముగ అవమానించినాడు. నేనిప్పుడువానిని నపరివారముగా నాశముగావించ ప్రతినపట్టితిని. అవమానము పాలైన కావించితీరెద! ఇందు నీసాహాయము కావలెను.

వివే—(తనలో) ఈమెకు మంజువాణియను సోదరికలదా? ఏమో మనకేటుల తెలియును. (ప్రకాశముగా) ఇప్పుడు నన్నేమి చేయుమందువు?

నాస్తి — నాయెడ ఆదరము చూపవలయును.

వివే—ఏవిధముగా ?

నాస్తి—చెప్పెదగా ! చల్లకువచ్చి ముంతదాచెదనా ? నామాట చెల్లింతుననుము చెప్పెదను.

వివే—అదెట్లు? నీకోరిక తెలియకనే చెల్లింతుననుటయా ?

నాస్తి—నీ ఆపద గడచు ఉపాయమే అది. నాకు ముదముగూర్చు ఉదంతము ! నీకుమేలుగూర్చుపన్నాగము. ఇకసందియమేల ? నీకు పురుషార్థసిద్ధి కలుగును.

వివే—బ్రతికె చెరువులో నున్నది. కొమ్ములుచూచి బేరమాడు మన్నట్లున్నది.

నాస్తి—నీకు ఉపనిషద్దేవియందు ప్రేమకొంచుకదా, నాకు మత్సరములేదు; ఆమెనుకూడ రక్షింపగలను. కామక్రోధాదుల ఇల్లాండ్రందఱు మత్సరము పూనతలపెట్టక నాఆదరమును చూఱగొందురు తెలియునుగదా! అట్లే ఇయ్యెడనువర్తింతును.

వివే—కూర్చుండ నైన కూర్చుండక వచ్చినపని వెంటనే ముగింతునంటివి. ఇంతటి దీర్ఘమగు ఉపోద్ఘాతమేల ?

నాస్తి—కామక్రోధాదులు కొలది మంది మాత్రము మహామోహుని వీడజాలకున్నను, మదమానమాత్సర్యాదులు నేను చెప్పినట్టుల వర్తింతురని ఎఱుగుము. నాయిచ్చ చొప్పున వారిని ఆడింపగలను.

వివే—నీవు చెప్పదలచినది పూర్ణముగ చెప్పి వేయుము.

నాస్తి—నేనును వేగిరపడుచున్నదాననే వినుము. ఉపనిషత్కాంత నాకన్న చిన్నది. ఆమెతో సరిసమానముగ నైన నన్నాదరింతువా! దరిచేర్తువా? నా మాటచెల్లింతువా?

వివే—ఇంకను విస్పష్టముగ వాకొనవలయును,

నాస్తి—నీపై మరులుకొని వచ్చినదానను. నా ముద్దు చెల్లింతువా?

తోడి-రూపకం-ఆట-ఆది.

వివే—మానుమాను మేటికిట్టి మాటలో తరుణీ?

నా స్తి—నినుమానగజాలను, నాముద్దుచెల్లించి మమతవెర్చుమా!

వివే—హరిహరియెంతటి దురిత మిటుల పరపురుషునితో బలుక?

నా స్తి—పరపురుషుడ వీవగుదువే నేను నేపరవనితనుగాను
నే నెవరివనిత గాను!

వివే—మానుమాను మేటికిట్టి మాటలో తరుణీ?

నా స్తి—అల మద మాన మాత్సర్య సతులజేర్తు నీమమందిరంబునా?

వివే—సూనృతి ధర్మను పిడి పసుత్వపు సుఖముకోరదగునే! పశువాంఛ
బూనదగునా!

నా స్తి—ఇదివినకుండవు కీమనుల్లు! నిక్కెల్లగతుల వినుమా!

వివే—మానువమాను మేటికిట్టి మాటలో తరుణీ?

నా స్తి—నీవు సార్థకనామకుడవు అనుకొంటిని నీలో వివేకము పొడగట్ట
రాదేమి?

వివే—అన్యోన్య పరపురుషు డనక నీవిట్టిసాహసములు పలుకుదువే?
పరస్త్రీ యనకనిన్ను చేరనిచ్చినందులకు ఇటులయ్యెగదా!

నా స్తి—ఒకతెకు వశుడవై నీవుపరపురుషుడవు అయిన అగుదువు
గాక; నేను పరస్త్రీనిగాను! నేను యెవనిస్త్రీని గాను!

వివే—శ్రీహరీ! ఏటి తర్కనీతి!

నా స్తి—నీవు సంస్మరించిన శ్రీహరినే అనుకరించుము. నిన్నువలచి
వచ్చిన రాధవంటిదానను నేనొకర్తుకనే.

వివే—ఇక నీ నీతులుచాలింతువా?

నా స్తి—వివేకా! వివేకముతో మెలగుము. ఈ క్షణమున నన్ను తిర
స్కరించిన నీవు చిరతరదుఃఖముల పాలగుదువు. ఒక్కక్షణము
ఉపనిషత్కాంతంగూర్చిన భయమును పోనాడి నన్ను ఆదరింతు
వేని శాశ్వతానందమునే చూఱగొందువు. విజయలక్ష్మి వాకిట
నున్నది! సైగచేసిన వచ్చును. అవివేకుడవై పోనాడుకొందువా?

వివే—ధర్మముపోనాడి సుఖముంగోరుకొనుట మానవునకు అర్హము కాదు.

నాస్తి—ఇక్కాలమున ధర్మమునకు బ్రతుకుతెరవు లేదని బ్రహ్మదేవుడే వ్రాసిపెట్టినాడు. ఇది కలికాలముసూ! సుందరాంగుల ప్రభావము వెలుంగుకాలము.

వివే—నీ సౌందర్యము వమ్మగు గాక.

నాస్తి—ఎంతటి అవివేకము ఈ శాపము లేల? ఇక్కాలమున శాపములు ఫలింపవులే సౌందర్యమువమ్ము అగు టెట్లు? ఇది దివ్యలక్షణము: "శివంశాంతంసుందరం" అని వినలేదా? మీ భగవంతుని లక్షణత్రయములో ఇది ఉత్తమ్మైనది
(విసరుకొను నెపమున చేయూచుచు చేతనున్న పూలచెండును వివేకునిపై బడవేయును)

వివే—(చెండును నేలకు విదల్చివేసి లేచి) ఈ ఆగడమోతసేపు! వెడలిపొమ్ము, ప్రకటితమగు అంగరాజతో నిట్లు తిరుగగా లజ్జ లేదా? (ఇక పొమ్ము)

నాస్తి—ఇంతదనుక నా సుందరాంగముల తనివిదీర దర్శించియు, అవివేకమును పోద్రోలలేకుంటివా? బంగారు పిచ్చుకకడ బంగారమెంతగలదో నీకడ వివేకమంతయే ఉన్నదని త్యాగము చేయుచుంటివి నామోహనరాసి! కానిమ్ము నిన్ను విడుచుదానకాను.

వివే—(దూరము తొలగి) నీకైనీవు బుద్ధిగఱవక హాగ్గమీయుచో నీకు బుద్ధిగఱప వలసివచ్చును సమీ!

నాస్తి—నిజముచెప్పుము. నీ ఉపనిషద్దేవిగాని లేక ఆముగుసలిది మతీదేవికాగా నాకన్నశృంగారవతులా? వెరజాణలా?

వివే—ఛీ. తొలగి చనుము!

నాస్తి—రానున్నరణమున ప్రతిరంగమునందును నేను విహరింపుచుందును. నీవు నేలగూలి, జాలి జూపుమని నన్ను వేడునప్పుడే నీకు

తగుబుద్ధి గఱపెద. లెమ్ము. ఈ అవమానమును విస్మరింపకుము. నేను మఱువను, మఱువను. (నిష్క్రమించును.)

వివే—అలమహామోహుని దుర్బుద్ధి విలసనమువలన, ఇదంతయు సంఘటిలుచున్నది.

గీ॥ ఓయి! తుచ్ఛా! మహామోహ! నీయుదగ్ర
వర్తనముచేత ప్రజలెల్ల పాపులై, దు
రంత సంసార కూపమధ్యమును వలచి
జ్ఞానపీయూష పాత్రచే బూనరకట!

జనులు సర్వవిధముల భంగపడుచుండిరిగదరా! జ్ఞానానందము మహామహాత్మ్యములు గలదై, తరంగరహితమై, అమృతసాగరమై, కలుగుచుండగా, నిస్సారములగు సంసారపు ఎండమావులందు మునుగుచు తేలుచు సుఖించగలమను మోహమున చిక్కుచుందురే. ఈ ఎండమావుల నీళ్ళతో దప్పిదీర్చుకొందమని దేవులాడుచుండిరే! ఈ మహామోహమునకు అజ్ఞానమే కారణము. అజ్ఞానము తత్వప్రబోధ వలనగాని అడంగదు. మహామోహుని ముఖ్యసేనాని కాముడు. వీనిని నిర్జించగలవాడు వస్తువిచారు డొక్కడే! వానిని ఇప్పుడే పంపెదగాక! (ప్రతీహారిణి) ఓ వేదవతీ! నీవుపోయి వస్తువిచారుని తోడ్కొనిరమ్ము.

వేద—చిత్తము. (వేదవతిఅను ప్రతీహారిణి పోయి వస్తువిచారుని తీసికొనివచ్చును)

వస్తు—అయ్యో! జడములౌ వస్తువులందు భ్రమచే కల్పించుకొనిన సౌందర్యాభిమానమువలన కామపిశాచము పోషింపబడుచుండె. దురాత్ముడగు మహామోహుడు ఎల్లెడల కాముని ప్రయోగించుచున్నాడు. పురుషుడు స్త్రీనికాంచినంతనే కలికి! కలువకంటి! కమలవదన! కంబుకంఠి! కమనీయభాషిణి, సుందరగాత్రి అనుచు స్తుతించును. అత్యంతము అసహ్యమగు ఆమె మాంసాస్థిపంజరమును చూచి మోహించును. ఆమాత్ర

## చతుర్థాంకము.

పురీషపు తిత్తిని చూచి కామించును. సరిగచీరలతోడను, పట్టురవికలతోడను ఆకోతలమూటయగు తనువును కప్పిపెట్టి చూచును. రకరకముల నగలతో రమ్యముగ ఒనర్పనెంచును. అత్తరు పన్నీరుల పూసి స్వభావదుర్గంధ నిలయమగు ఆమె దేహమును దగ్గరచేర్చి ముద్దాడును ఇక వైరాగ్యము [illegible] స్త్రీయు అట్లనే భ్రమల మునుంగు చున్నది. తాను అందగత్తెనని తలపోయుచున్నది. పురుషుడు మన్నించుచున్న తన సొగసులన్నియు, తన జీవనమే వ్యర్థమను కొనుచున్నది. వాని మీసాల సొంపుచూచి మరులుకొను చున్నది. వాని గంభీర దృక్కులకు మోసపోవుచున్నది. వాని తనువు కలుషసహ్యమగుచీము నెత్తురు వస మున్నగునవి చేరిన అశుద్ధపుమూటయేనని శంకించకున్నది. తననోములకు మెచ్చి కల్పతరువొసగు అమృతఫలమే పురుషుడని పొఱబడుచున్నది. విరక్తిగనకున్నది. ఇట్లు ఇరువురును నరక కూపమున బడి వెలువడు [illegible] కానకున్నారు! విద్యలందును బలపరాక్రమ ములందు వ్యవహార దక్షతయందును ఘనుడనని నటనలచేయు పురుషుడే మిగుల దోసకారిగ దోచుచున్నాడు.

మోహన. ఆది.

1. అయ్యో, ఏమనందూ జనుల అన్యాయవర్తనము ధరలో
చయ్యన సతిపతుల పొందూ సాగించుచునుండి రకట ॥అ॥
2. మాంసపిండదేహములు, మఱి బంగారు బొమ్మలంటూ
మలినదుర్గంధముల స్త్రీని, కలికీయంచు పలుకునరుడహో॥ అ॥
3. తరుణీ పురుషులు కటకటా కరు, మరులుచెంది నిరతమునూ
అగ్నిలో శలభంబులట్లు, హతమై పోవుచుండిరకటా॥ అ।

ప్రతీ—అరుగో, దేవరవారు వేంచేయుచున్నారు. సమీపింతము.

వస్తు—దేవా! సేవకుడు వస్తుపాలుడు నమస్కరించుచున్నాడు.

వివే—మహామోహునితో మనకు యుద్ధము ఘటిల్లినది. వాని ప్రధాన వీరుడు కాముడు. వానిని నిర్జించుటకు నిన్ను నియోగించు చున్నారము.

వస్తు—నేను ధన్యుడ

వివే—నీవు ఎట్టి ఆయుధములను వానిపైని ప్రయోగించగలవు ?

వస్తు—వాడా తనువు లేనివాడు! వానికున్నవి అయిదు పూవుటమ్ములు! కాన ఆయుధప్రయోగము కూడ అవసరముండునా ? చిత్తమును ఇంద్రియ మార్గములనుండి మరల్చెదను. తనువులు రోతలమూటలు గాన ప్రీతితో వానిని ముట్టతగదని బోధింతును. స్త్రీపురుషులు విపరీతవేషభాషలను హావభావములను విసర్జించునటుల నచ్చజెప్పెదను. ఉన్నదున్నట్లు వస్తుస్వరూపమును కనునటుల చేసెదను.

వివే—మంచిది నీవు అటులనే చేయుము పొమ్ము.

వస్తు—దేవరఆజ్ఞా నిర్వహణమునకై పూనెద. (నిష్క్రమింతురు.)

వివే—వేదవతీ! నీవు క్షమను పిలుచుకొని రమ్ము.

ప్రతీ—చిత్తము. [నిష్క్రమించి క్షమతో ప్రవేశించును]

క్షమ—క్రోధమహాంధకారుని చూపులకు బెదరి, ఎదిరివారల దూషణలకు తూలిపోయి, తోడివారి తిరస్కారములకు మరి చెదరి సాధువులుసంయితము ఓరిమి వహించలేకున్నారు. పిల్లగాడ్పులకు సంయితము సహించజాలని చిగురుటాకులవలె ప్రకంపితులగుచున్నారు. ఒకింత నిలకడగ కూర్చుండి చలించకున్నచో, పెనుశిలనుతాకు అలలబోలి క్రోధప్రేరితములగు దుంగుడుకుచేష్టలు తమంతట నవియే నశించునే!

ప్రతీ—అరుగో మహారాజులవారు!

క్షమ—మహారాజులవారికి విజయమగుగాక! నమస్కారములు.

వివే—ఓక్షమా! మాకిప్పుడు సంప్రాప్తమైన యుద్ధమునందు దురాత్ముడైన క్రోధుని కూల్చుటకు నిన్ను నియోగించనున్నారము.

క్షమ—దేవరవారి అనుగ్రహమువలన నేను మహామోహమునే జయింపగల్గుదును. ఇక అతని అనుచరులెంతటివారు? క్రోధుని ఉపేక్షామాత్రముచేతనే జయింపగలను. క్రోధుడు కూలెనా మానుడు, మాత్సర్యుడు, పారుష్యుడు, హింస ఎల్లయును హతమగుదురు దేవా!

వివే—అట్లయిన అగుగాక. శత్రువిజయమున పూనికవహింపుము.

క్షమ—మహాప్రసాదము. [నిష్క్రమించును]

వివే—వేదవతీ! పోయి సంతోషుని పిలుచుకొని రమ్ము.

వేద—చిత్తము. (వెడలపోయి, సంతోషునితో ప్రవేశించును.)

సంతో—(జ తో)

తరువులు నీడలిచ్చి ఫలదానము సేయవె. మంచినీరముల్
పారులుచు రావె కొండపైను లోయలవెంబడి? పిల్లగాడుపుల్
బరువిడి వీచవే? ప్రకృతి వల్లనె వాంఛిత సిద్ధిగల్గదే?
నరులడియాస జబ్బుపడినన్ రుచియించునె తుష్టిపథ్యముల్?

(ఆకాశము వంకచూచి)

ఓరీ! లుబ్ధా! లోభాధమా! ఆకాశపుష్పముల మెఱుంగులు చూపి ఆశాపరులచేసి అమాయిక ప్రజలను అష్టకష్టముల పాల్సేయుచుంటివిగదరా? అష్టైశ్వర్యములటు చూపుదువు; అష్టకష్టముల కుడుపుదువు. ఏమి ఆశ్చర్యము? ధనము జూచి జనులు నీవలలలో తగుల్కొనుచున్నారు. ప్రతివాడును "నేను ధనమును ఆర్జించెదను; దొరకిన ధనమును ఇంకను పెంచెదను. లాభముల గడించియు వృద్ధిలపెంచియు వర్ధిల్లుదును." అనుచు దివారాత్రములు ధనమునే ధ్యానించును. కటా! ఈధనమును గడించుటే మొదట కష్టము. అపయిని దానికి క్షయమును వినాశమును అను రెండుగతులు తప్పవు. ఇట్లు ధనము పోగా పొగులుచుండు జనులు ఆవ్యథలను మాన్పుటకు ధనమే సాధన

మని మరల అధనమునే కూర్చుకొనఁజూతురు. తిరిగి ఈబాధా
చక్రగమనమే ఘటిల్లును! ఓరిమూర్ఖనరుఁడా! సంతుష్టిప్రసాదించు
శాశ్వతానందమును రవంత రుచిచూడుమా!

ప్రతీ—వీరె ప్రభువువారు; ఓ మహానుభావా! సన్నిధికిపొందు.

సంతో—స్వామీ! జయము జయము! వీఁడే సంతోషుఁడు నమస్క
రించుచున్నాఁడు.

వివే—నీప్రభావము లోకవిదితము ఇప్పుడు బహుభాషణములతో
పనిలేదు. నీవు లోభునిజయించుటకు వారణాశికి పోవలయును.

సంతో—చిత్తము. (నిష్క్రమించును.)

(పురుషుఁడు ఒకఁడు ప్రవేశించును.)

పురు—దేవా! విజయప్రయాణ మంగళములు ఒనుపబడినవి. దండ
యాత్రాసమయము సమీపించినది.

వివే—మంచిది సేనాపతులతో సేనలబయలుదేఱ నియమించుడని
చెప్పుము. మేమును వచ్చుచున్నాము. (నిష్క్రమింతురు)

---

# ప్రబోధచంద్రోదయము

## నాటకము.

### పంచమాంకము.

(శ్రద్ధ ప్రవేశించుచున్నది.)

శ్రద్ధ—

క॥ చెట్టుకు చెట్టుకు రాపిడి
పుట్టిన, దావాగ్ని దవిలి భూరుహపుంజం
బెట్టుల దగ్ధమ్మగు తుది;
అట్టుల సోదరులునాశమైచని రాజిన్.

జ్ఞాతివైరమను ఈ అగ్నివలన క్రోధంపుపెనుమంట బయలువెడలెను. అది కులమునంతను భస్మముచేసినది. చెట్లురాచుకొనుటచేత పుట్టకార్చిచ్చు కాననమునంతను తగులబెట్టును గదా. సోదరుల మరణము వలన కలిగిన ఈ శోకాగ్నిని వివేకనీరదము చల్లార్పజాలకున్నది. క్రూర స్వభావులయిన కామక్రోధాదులును సోదరులే అగుటచేత వారి నాశమును దుస్సహముగనేయున్నది. (ఆలోచించి) విష్ణుభక్తి దేవి యిట్లు ఆజ్ఞాపించియున్నది. "శ్రద్ధా! కాశీపురమున హింసాప్రధానమయిన ఈ యుద్ధమును నేను చూడజాలను. కావున సాలగ్రామము అనుపేరుగల విష్ణుక్షేత్రమున కొంతకాలము గడపబోవుచున్నాను, నీవు అక్కడికివచ్చి యుద్ధవార్తలు తెలుపుము"

కావున ఇచ్చటికివచ్చితిని. (చూచి) అదిగో విష్ణుభక్తిదేవియు శాంతియు వచ్చుచున్నారు.

(విష్ణుభక్తిదేవియు శాంతియు ప్రవేశింతురు.)

శాంతి—అమ్మా! మీరు చాల చింతాకుల హృదయలైయున్నారు?

విష్ణుభక్తి—బిడ్డా! వీర నాశకరమగు ఈ ఘోరయుద్ధమున, మహామోహునివలన వివేకునికి ఏమివాటిల్లెనో అని ఆరాటపడుచున్నదానను.

శాంతి—దేవీ! ఇక్కడ ఆందోళనకు కారణమేమున్నది? దేవిగారి అనుగ్రహముండగా వివేకమహారాజుగారికి విజయము నిశ్చయమే గదా!

విష్ణు—బిడ్డా! ధర్మపక్షమునకు అనివార్యముగ విజయము కలుగును అనుట నిజమే. అయినను సుహృత్తులగు వారిం గూర్చి మనస్సు అపాయశంక పూనుచుండును. శ్రద్ధ ఇంత తడవయినను రాకున్నదేల? అను సంశయము బాధించుచున్నది.

శ్రద్ధ—(సమీపించి) భగవతీ! ప్రణమిల్లుచున్నాను.

విష్ణు—శ్రద్ధా! నీవు క్షేమముతో వచ్చితివా?

శాంతి—అమ్మా! నమస్కరించుచున్నాను.

శ్రద్ధ—భగవతీ! మీ అనుగ్రహమువలన నాకు క్షేమమే. కుమారీ శాంతి! భగవతి కృపవలన మునిజన నివాసములందు నిలయము పొందుదువు గాక.

విష్ణు—అక్కడ ఏమి జరిగినది. క్లుప్తముగ చెప్పుము. ఘోరవార్తల వినజాలను.

శ్రద్ధ—దేవిగారికి విరోధముగా వర్తించువారికి తగినటుల జరిగినది. దేవీ! వినుము. యుద్ధారంభకాలమున మహామోహుని కడకు వివేకమహారాజుగారు, నైయ్యాయికుని దూతగా పంపినారు: మహామోహుడు హరిహరమందిరములను, పుణ్యనదీ తీర్థస్థానములను, భక్తాంతరంగములనువిడిచి పరివారసహితముగా మ్లేచ్ఛదేశములకు పోవలయును. లేనియెడల వారి మాంసములను కుక్కలు నక్కలు విందులారగించునని చెప్పుబంపిరి.

విష్ణు—తరువాత తరువాత?

శ్రద్ధ—దేవీ! మహామోహుడు ఆగ్రహావేశుడయి ఆ దుర్నయఫలము వివేకప్రేతమునకే మూడునన్నది: అని బిరుదులు చెప్పినాడు. పాషండాగమ శస్త్రాస్త్రములను ప్రయోగించి యుద్ధము నారంభించినాడు. ఈలోపల మన సైన్యముఖమున, వేదవేదాంగములను స్మృతిపురాణేతిహాసములను తోడతీసికొనివచ్చి సరస్వతీదేవి నిలిచినది. అప్పుడు వైష్ణవ శైవ సౌరాదులయిన సర్వాగమబృందములును సరస్వతీదేవి సన్నిధికి వచ్చిచేరెను.

విష్ణు—అటుపిమ్మట?

శ్రద్ధ—తదనంతరము యుద్ధము మహాఘోరముగ సాగినది. జయలక్ష్మి ఎటుచేరవలయునో ఎఱుంగజాలక చాల చీకాకుపడినది. యుద్ధవర్ణన విన కడుదుస్సహముగ నుండును. వివరించి చెప్పబోవుచో ఆదృశ్యములు మనస్సునకు చిహ్వాదయమును వ్యయ్యలు జేయును.

విష్ణు—సంక్షిప్తముగా పర్యవసానమును తెల్పి చెప్పుము.

శ్రద్ధ—అటులనే చేసెదను. వస్తువిచారునిచేత కాముడు కూలినాడు; క్షమచేత క్రోధుడు, పారుష్యుడు, హింస హతమైరి; సంతోషుడు లోభుని తృష్ణను తునుమాడినాడు; మఱియు దైన్యుడు అనృతవాదుడు పిశునుడు స్తేయుడు పరిగ్రహుడు వానిపైనిబడి పోరి, తుదకు మారణమైరి. అనసూయ మత్సరుని మంటగలిపినది. పరోత్కర్షాసంభావునిచేత మదుడు మర్దింపబడినాడు. పరగుణాధిక్యుడు మానుని మారణముచేసినాడు.

విష్ణు—(సంతోషముతో) చక్కగా జరిగినది. సరేగాని మహామోహుని వృత్తాంతము చెప్పవైతివి?

శ్రద్ధ—మహామోహుడు యోగవిఘ్నులతో కూడి పాఱిపోయినాడు. ఎచటనో దాగినాడు.

విష్ణు—అటులనా! ఇంకరణశేషము మిగిలి యున్నట్లేనే! అతడును హతముకావలసిన వాడేగదా! స్థిరసంపదకోరు బుద్ధిమంతుడెవడును అగ్నిశేషమును, ఋణశేషమును, వ్రణశేషమును,

రణశేషమును మిగుల్చుతగదు. ఇక మనస్సు మాటయేమి? అత డెట్లున్నాడు?

శ్రద్ధ — దేవీ! ఏమిచెప్పుదు? పుత్రపౌత్రవర్గము యుద్ధమున పడిపోయి రనుదుఃఖముచేత ప్రాణత్యాగముచేయ నిశ్చయించుకొనినాడు.

విష్ణు — (చిరునగవుతో) ఇదంతయు ఇట్లు జరుగుటచేత మనము కృతార్థులమైతిమి. పురుషుడిక పరమానందమును పడయగలడు. ఈ మాస్సంగుడగు మనస్సు ప్రాణత్యాగమున కేటుల తెగువ చేసినాడు?

శ్రద్ధ — ప్రబోధోదయముకొఱకు ఉపనిషద్దేవి వివేకునిచేర సంకల్పించినదని తెలిసికొనినాడు. అంతట తాను వెనుకటి తీరుననే ఇక జీవించుట పొసగదని గ్రహించినాడు.

విష్ణు — అగుగాక. వైరాగ్యుని తోడ్కొనిపోయి తండ్రియగు మనస్సుతో కూర్చుకొనుటకు సరస్వతిని పంపనున్నాను.

(నిష్క్రమింతురు.)

( మనస్సు సంకల్పుడు ప్రవేశింతురు. )

మన — (కన్నీటితో) హా! పుత్రికులారా! ఎక్కడికి పోయినారు? ఓరోరి ప్రియకుమారులారా! నన్నొకసారి కౌగిలించుకొని ఓదార్చుడు. నాఒడలు మండుచున్నది. అనాథుడను, వృద్ధుడను. ఎవరును ఆదరింపరారా! ఎవరునురారా?

ధన్యాసి — రూపకం

1. హా! కుమారులార! ఎందు అణగియుంటి రకట కటా?
శోకము భరింపజాల చూడరేమి వృద్ధజనకు — హా!
2. రాగద్వేషు లాదిసుతులు రండునన్ను కౌగిలింప
వేగరారె హింసాసూయ వేగవతులు నన్నుజేర — హా!
3. పాడుదైవమయ్యో మిమ్ము పాడుజేయపూనినాడే
నేడదెంతదుర్దినంబో కీడువార్త వినగవలసె — హా!

రతీహింసా తృష్ణా మొదలగు కోడండ్రారా! మందభాగ్యుడనైన నన్ను పరామర్శింపరా? ఒక్కరును నాగతి కనుగొనువారు లేరా! ఆ దైవహతకుడు మిమ్ములందఱను ఒక్కసారిగా తన కడుపున బెట్టుకొనినాడా? కటకటా! ఈ శోకజ్వరమునకు ఓర్వజాల.

(మూర్ఛిల్లును.)

సంక — రాజా రాజా! తెప్పిఱిలుడు.

మన — (తెప్పిఱిలి) ఇట్టి దురవస్థను పొందియున్న నన్ను ప్రవృత్తిదేవి యేని ఓదార్పరాదేలనో?

సంక — (కన్నీటితో) కటా! నీకు ఇంకను ప్రవృత్తిదేవి ఎక్కడిది? తన సంతానమంతయు అంతరించుటచూచి గుండెపలిగి మృతి నందినది.

మన — హా! ప్రియసతీ! నన్నొక్కసారి ఒక్కసారి నీప్రియవచనములతో మన్నింపుము. నన్ను నీవును విడిచి చనితివా. నమ్మజాల నమ్మజాల. ముందు ఎన్నడును స్వప్నమునందు సంయితము నన్నువిడిచి యెఱుగవే! నీవులేకున్న నాకు బ్రతుకేమున్నది? అయినను బ్రతికియేయుంటినని అగ్రహామా? కోపమా? కృతఘ్నుడ నందువా?—ఇదిగో వచ్చుచున్నాను; వచ్చుచున్నాను.

(లేవబోయి మూర్ఛిల్లును)

సంక — మహారాజా! ఇదేమి? ఇటుల భీరువగుట తగునా? ఊరడిల్లుడు.

మన — (తెలివిరాగా) ప్రియసతీ! ప్రియసతీ! పోకుము పోకుము. నేను తోడనే వచ్చుచున్నాడను. ఓసంకల్పా! చితిని పేర్చుము. ఇప్పుడు నేను అగ్నిలో మ్రగ్గి శోకాగ్నిని చల్లార్చుకొని నా ప్రేయసిని కూడెదను.

(అగ్నితనంత ప్రజ్వరిలును - మనస్సు అగ్నిలో పడబోవుచు.)

ఆ హా హా! అగ్నీ ఎంతవడిగ వచ్చివేసితివి. నిన్నాశ్రయించిన వారు ఉత్తరక్షణముననే ఉత్తరలోకముల చేరుదురు గదా? నన్ను నా

ప్రవృత్తిదేవితో చేరుదువా? అటులమాటయిత్తువా? లేక నాపైనిఆగ్రహించి సర్వనాశము చేతువా? హా! హా! (ఆకాశమువంక జూచుచుండును.)

(సరస్వతీదేవి ప్రవేశించును.)

సర— గీ॥ సచ్చిదానందమయునకు శాశ్వతునకు
ఆదిమధ్యాంతరహితున కవ్యయునకు
పంచకోశవిలక్షణ భాసితునకు
వందనంబు బ్రహ్మమునకు వందనంబు.

భగవతి విష్ణుదేవి నాతోనిట్లనినది. "సఖీ! సరస్వతీ! బిడ్డల చావుంగూర్చి శోకించుచున్న మనస్సుయొక్క ప్ర[illegible]కొఱకు పోమ్ము. వైరాగ్యునితోఁ గూడనిపోయి యువ్వరకు సంగాతము కూర్చుము" కావున నేనిప్పుడు మనస్సుకడకుపోయి వానిస్థితి విచారించెద గాక. వైరాగ్యుడును త్వరలోనె రాగలడు. (సమీపించి) వత్సా! ఏమిచేయనుంటివి? ఈ అగ్నిప్రవేశ ప్రయత్నమేల? ఈతీరున నీవు అతిపరితాపము పడనేల? పుట్టినవెల్ల గిట్టితీరునని ఎఱుంగవా? చిరకాలమునుండి పురాణములను ఇతిహాసములను ఎన్ని చదివియున్న వాడవు కావు? ఈ జగమంతయు, ఈభూమి, ఈసముద్రాలు, ఈ నదులు, ఈపర్వతాలు, చంద్రుడు, సూర్యుడు, రుద్రుడు, సురేశుడు, మునులు ఋషులు, నరులు, రాక్షసులు ఎల్లఱును కాలగతిని చనువారే కారా? బ్రహ్మదేవుడు సంయుతము కల్పాంతమునన్నైనను బ్రతుకు పీడుగాదే. నీ బిడ్డలుమాత్రము వేఱువారా? నాశముకాదగువారు నాశమందిరని యింత శోకమా?

కమాజు—ఆట.

1. మనసా ఏటికియీ చింతా, మానుమొక్కంతా ॥మనసా॥
జననము మరణము అనయముందును గాదే!
ఘనదేవతలకైనా కల్పాంతమునన్నైనా॥ మనసా॥

2. పుట్టినవెల్లను గిట్టుట నిజమౌను
పుట్టుగిట్టులు లేనిచోట్ల [illegible]సుమ్ము॥ మనసా॥
3. నిత్యానిత్య వస్తునిర్ణయంబును జేసి
సత్యమార్గము గాంచె నిత్యమునిలువరా॥ మనసా॥

ఇంతగా మోహపరుడవగుట తగునా? నీటిబుడగబోలు సంతానము శేలగలనెని కనలు గదా? సువిచారముచేసి చూడుము. వివేకుని పిలిపించి ఆదరించుము. ఆతని కృపేవ సర్వమును చక్కబఱచును.

మన—భగవతీ! శోకావేశముచేత మోసమైయున్న నన్నిప్పుడు వివేకుడు ఆదరించునా? వానితో నాకప్పుడు పొత్తు కుదురదు; కుదురదు. ఆమాట నెత్తబోకుము. నీకు వందనము. నాకు మరణమే శరణ్యము.

సర—వత్సా! నీవు పొఱబడుచున్నావు.

ముఖారి—ఆది.

1. అయ్యయ్యో భ్రాంతిచే ముదమునే సరికాని
అన్యాయంబగుగాదే
ఆర్యధర్మములు హత్తమై పోవగ
అనార్య కార్యము లిట్లు బూనితివి
పాపకర్ముని పలుమఱు చెప్పిన
పటుతరనీతులు వినుమా
మదిగనుమా భవవార్ధిని బడబోవకుమా॥ అ॥
2. గాలమునందున్న గల ఎఱనుగని
కడు మోహంబున మ్రింగదలంచిన
మత్స్యము వెంటనే మరణముచెందిన
గతిసంసారములోనా బలమైనా
విషయములా కడువడ జిక్కగనేలా॥ అ॥

ఇదినీవు కావించియున్న స్నేహముయొక్క ఫలము. ఇందుకే దుష్టసహవాసము సర్వానర్థములకు మూలమని పెద్దలు పలికిరి. దారి కనబడుచున్నను కండ్లుమూసికొని దుఃఖములపాలగుట, ఆదుఃఖములనే సహజసంఘటనలని వానినే హత్తుకొనియుండుట విడ్డూర్యము. దుఃఖ కారణములగు దుర్విషయబీజములకు ముద్దుపేరులను పెట్టుకొని, హృదయమున నాటుకొందురు. వానికి స్నేహాంకురములు పుట్టును. మహా వృక్షములుగ పెరుగును. వేనకువేలుగా, లక్షలు కోట్లుగా దుఃఖఫలములను ప్రసాదించును.

మన—దేవీ ! నీమందలింపులన్నియు సత్యములే కావచ్చును. శోకమను అగ్ని నన్నిప్పుడు దహించుచున్నది. నేను ప్రాణముల నిలుపుకొనజాలను. ఈ నా అత్యంతకాలమున దర్శన మిచ్చితివి. అంతేచాలును వందనములు.

సర—ఓయీ ! ఆత్మహత్యాప్రయత్నము మిక్కిలి దోషాకరమని ఎఱుగవా? మఱియు అపకారపరులు పోయిరనియా ఇంతటి వేగిరపాటు? ముందెన్నడుగాని ఈనాడుగాని ఆలుబిడ్డల మూలమున ఎవరేని సుఖముల పడసిరా? ఇకనెన్నడైన పడయుట పొసగునా? అయ్యో ! నీదుష్టసంతానము చచ్చియు నీకడుపున చిచ్చు పెట్టుచున్నారే ! అట్టి వారిని గూర్చి ఆర్తిపాలగుట మూర్ఖలక్షణము కాదా?

మన—ఇది నిశ్చయమే తల్లి ! అయినను తనవలన పుట్టి, తనలాలనచే పెరిగి, తనకు నచ్చునటుల వర్తించి, ఎకశాసిచనిన బిడ్డల తలంచుకొని జీవముల నిలుపుకొనుట దుష్కరముగాదా ?

సర—దీనినంతటికిని మూలమేదో విచారించుము.

నాటకురంజి—ఏక.

మమకారమే కారణం, వ్యామోహామునకు॥ మ॥

1. తనవారు పెరవారు, అను భేదబుద్ధిని
జనియించు నజ్ఞాన, జగమంతటను గూడ॥ మమ॥

2. తనలోన పుట్టుచుండిన, జంతువుల పైని
తనయుల పైవలె ప్రేమ, దాల్తురే యెవరైన॥ మమ

3. ఆలుబిడ్డలనమ్మి, మేలైన పదవుల
చాలగ బొందక నశక్యమెవ్వరికేని॥ మమ॥

మమతలేని యెడల స్వాంతసన్నిహితులు చనినను చీమకుట్టినంత చింతయు నుండదు. మానవుడు, బిడ్డలు తనువున పుట్టుచున్నారందురు. వారిని ప్రేమింతురు! వారికొఱకై తాముచత్తుమందురు. తమ తనువు లందే ఎన్ని యోజాంతువులు పుట్టుచున్నవి. ప్రేవులందు, పుత్తలందు, చెమటయందు లెక్కలేనన్ని జీవరాసులు జనించుచున్నవే! వీనిని మాత్రము బిడ్డలను కోరాదా? ఈ విభేదము ఎందువలన కల్గుచున్నది? మమత అందు లేకపోవుటచేతనేగదా! కావున భిక్షూ! మోహప్రేరిత మైన మమతను విడిచి ఇకనైన సుఖించుము.

మన — అదంతయు సత్యముగనే కాన్పించును. సులభముగ అను సర ణీయమును భ్రాంతిగల్పించును, కాని నాస్థితి విచారించుము.

సీ. దేవి! నీవొనరించు దివ్యోపదేశమ్ము
సత్యమేయగుట నిశ్చయము; కాని ... ...
సంసారవృద్ధ వృక్షము వేళ్లుదిగియుండె
పెనులోతులకు నూడఁ బెఱుకరాదు;
ఘన మమత్వగ్రంథి పెనవేసికొని పోయె;
చిక్కు డలింప జూచినను రాదు.
బహుకాలవాంఛ నావంశ కల్యాణ వ
ర్ధనము దానికిఁ గష్టదశలు వచ్చె.

గీ. కొడుకులును కూతులును చావఁ గొంతసైతు,
పౌత్రసంతతి చనిన నోర్వంగవచ్చు,
పాపిదైవము నవనవ ప్రసవసముల
ముద్దు మునిమనుమలను గొంపోయెనకట!

రాత్రిపుట్టి, ప్రొద్దుపొడవకమున్నె రాలిపోవు పారిజాతపుష్పముల చందమయ్యెగదా ! (ఏడ్చును)

సర—వత్సా ! ఊరడిలుము. పదార్థముల నిత్యానిత్య విచారణయే మమత్వమును భేదించుటకు మంచి ఉపాయము. నీవెవరు ? నీ ఈసంబంధము లెటువచ్చునవి ? ఎటుపోవునవి ? ఎంతవఱకివి నీవి? యోచింపుము.

కానడ—ఆది.

1. ఎవడు నీవు? నీసతిసుతు లెవ్వరు?
ఎక్కడిసంబంధం బిదిరా?
భువిపై కెయ్యెడనుండి వచ్చితివో
పూర్ణముగా యోచింపుమురా॥ ॥గోవిందా॥

2. తామరాకుపై నీటివలెను నీ తను వతిచంచలమైనదిరా
పామర మమకారముల మున్గినది
పాడ జగంబని తెలియుమురా॥ ॥గోవిందా॥

మన—(యోచించి) భగవతీ! నీప్రసాదమువలన నామమత్వ మోహము పోయినది. కాని నీ సుబోధామృతమువలన శుద్ధమైన నాహృదయమున, శోకతరంగములు మరల లేచుచు, దానిని మలినము గావించుచునే యున్నవి. ఈశోకకల్లోలముల నడంచు సాధనములు లేవుగదా !

సర—వత్సా ! వానిని ఇదివఱకే మహాఋషులు తెలిపి యున్నారు. ఆత్మచింతనము అందుకు తగిన పరమసాధనము.

మన—భగవతీ ! సత్యమే. చిత్తము సులభముగా స్వాధీనపడునది కాదుగదా. ఒకచింత తొలగింపబడగానె మరల నెన్నిచింతలో పరంపరలుగా వచ్చి చేరుచుండును. మఱింత వికారమునకు లోనుకావలసి వచ్చుచుండును.

సర—బిడ్డా ! చిత్తమునకు ఈవికారబాధయుండుట సత్యమే. కాబట్టి ఆచిత్తమునకు శాంతివిషయము నొకదానిని అను సంధానము చేయుము. అంతట అది కుదుటపడును.

మన—భగవతీ! ఆ శాంతివిషయమెద్దియో కరుణించి తెలియజెప్పుము.

సర—వత్సా! అది పరమరహస్యము. అయినను శోకముచేత ఆర్తుడవై యున్నాడవు గాన నిరుపదేశించుటలో దోషముండదు. అల శ్యామసుందరగాత్రుని శ్రీహరిని భజింపుము, లేదా సకల శోకహారుని మహాశివుని చింతింపుము, లేదా గ్రీష్మంబున కొల కుల నీరములహరించు దినకరుని బోలి, స్వాంతములనిండు శోక రసముల సదాహరింపగల బ్రహ్మమును ఉపాసింపుము.

మన—(ఆలోచించి, సట్టాకుప్పవిడుచుచు) సర్వవిధముల నేను దేవి గారివలన రక్షణగంటిని. ఇదే సాష్టాంగ నమస్కారశతము, నర్పించెద,

కల్యాణి—రూపకం.

1. వందనములు గైకొనవే వాణి జలజాతపాణీ
పొందుగ నీ దయను నాదు బుద్ధిమాంద్యమెల్ల సమసె॥ వం॥

2. శోకాగ్నినిబడి కుమిలెడు నాకు బ్రహ్మబోధ తెల్పి
ఏకాగ్రత నొడగూర్చిన నీకిదే సాష్టాంగమమ్మా॥ వం॥

3. అరమరలేదికను నమ్ము అంబా నేకడతేటితి
హరిహర బ్రహ్మలకవ్వలి ఐక్యపదవి గాంతునమ్మా॥ వం॥

సర—వత్సా! నీహృదయము ఇప్పటికి సదుపదేశముచేత క్షమనంది నది. ఈ ఓరిమిని చిక్కబట్టుము. నీకు ఇంకొకటి ఉపదేశించెదను. వినుము తండ్రియో తల్లియో బిడ్డయో బంధువో మిత్రుడో మరణించగనే బుద్ధిమాలినవాడు రొమ్ముబాదుకొనుచు రోద నము చేయుచున్నాడు. ఈ సంసారము చూడచూడ సారములేని సందడి అనిగ్రహించి ఊరటపడువానికి ఆవియోగమే వైరాగ్య భాగ్యమును సమకూర్చి పెట్టుచున్నది.

(వైరాగ్యుఁడు ప్రవేశించుచున్నాఁడు)

వైరా— కీ ర్త న.

1. గోవిందాహరి గోవిందాయని దేవుని వేడర మూఢమతీ
కాపదురా ఈ సంసారము నిను కాలుండీడ్వగ మందమతీ॥ గో॥

2. ప్రాణవాయువున్నంతవఱకె నిను బంధువులరయుచు నుందురురా
ప్రాణముపోయినవెనుక భార్యయును పట్టిచూడ భయమందు
నురా॥ గో॥

ఆహాహా! ఆబ్రహ్మదేవుఁడు రమ్యమగు చర్మముతో కడునేర్పున మూసిపెట్టెను గాని, లేకున్నచో, దుర్గంధములీను చీము నెత్తురు వస మాంసము ప్రేగులు ఎముకలు మూత్రము పురీషము కూడియున్న ఈ పెంటకుప్ప శరీరమును కుక్కలు నక్కలు రాబందులు చీల్చి పీకికొని తినకుండ ఆపువారుందురా? మెఱపుతీగె భోగములవంటివిగదా భాగ్య రాసులు? సంభోగములు ప్రాణత్యాగములేగదా? లోకములు శోక సముద్రములు; ధనములు మనముగాల్చు ఇంధనములు! ఆత్మవిచార శూన్యులు మాత్రమే వీనికి తగులువడి ముక్తి కానకున్నారు.

సర—వత్సా! మనసా! ఇదె వైరాగ్యుఁడు నీకడకు వచ్చుచున్నాఁడు. ఈతనిని గౌరవింపుము.

మన—నాపుత్రుఁడు వైరాగ్యుఁడా!

వైరా—తండ్రీ! నమస్కరించుచున్నాఁడను.

మన—వత్సా! పుట్టగనే నీవు నన్నువిడచిపోతివి. నన్నిప్పుడైన కౌగి లించుకొనుము.

వైరా—(తండ్రిని కౌగిలించుకొనును.)

మన—వత్సా! నిన్ను చూచుటతోడనే నాశోకాగ్ని ప్రశాంతమైనది.

వైరా—ఓతండ్రీ! ఆశోకాగ్ని ఏల? ఎవరికొఱకు? దారిలో బాటసారులు, వఱదలో కట్టెలు, ఆకసము, మబ్బులు, సముద్రమున నావికులు, సంతలో సంబారముల కొనువారు, వడివడివచ్చుచు కలియుచు విడిపోవుచు నుంద్రు. అదేతీరున తలిదండ్రులు అన

దమ్ములు ఆలుమగలు పుత్రమిత్రులు చేరుచు పాయుచు నుందురు. ఇది ప్రకృతిసిద్ధము. ప్రాజ్ఞులగు వారికి ఈసంయోగ వియోగములవలన విషాదానందములు కలుగవు.

మన—భగవతీ! నాకుమారుని పలుకులు ఎంతయు సత్యములు. తొంటి నా అనుభవములన్నియు కలలందుగాంచిన కల్లలుగా తోచుచున్నవి. విచారించిచూచిన నవ్వువచ్చుచున్నది.

సర—వత్సా! ఇదంతయు తథ్యమే అయినను, గృహస్థుడు ఆశ్రమ ధర్మమును విడిచి దోషికాతగదు. అదియు భీరుత్వమే. కావున నేటినుండి నివృత్తిదేవిని నీ సహధర్మచారిణిగ గ్రహించుము.

మన—(లజ్జతో) దేవిఆజ్ఞకు బద్ధుడను.

సర—శముడు దముడు సంతోషుడు మున్నగు నీపుత్రులు నీకుపచార ములు చేయుచుందురు. యమ నియమాదులు నీకిక మంత్రి ప్రధానులై రాచకార్యముల చక్కబెట్టుదురు. వివేకుడు ఉపనిషద్దేవితో గూడి నీ అనుగ్రహమువలన యువరాజ్య పట్టము గట్టుకొని పరిపాలనముచేయును. మైత్రి కరుణ ముదిత ఉపేక్ష అను నీతోబుట్టువులు భగవతియైన విష్ణుభక్తికృపవలన నిన్నువచ్చిచేరుదురు. వారిని ప్రసాదపూర్వకముగా ఆదరింపుము అన్నింటను నిర్లిప్తుడవై అంటువడక ధర్మమును సాగనిమ్ము.

మన—దేవి ఆజ్ఞాపించినటుల చేసెదను. మీ ముదజోలను దల దాల్తును. (పాదాలపైపడును.)

సర—ఇట్లు సామ్రాజ్యమును నడపి నీవు స్వస్థుడవైనప్పుడు, పురుషుడు తన పరాప్రకృతిని పొందును. సూర్యబింబము సముద్ర తరంగములందు వలె, బ్రహ్మము ఒక్కటయ్యును నీసహవాస వృత్తులవలన, అద్వితీయముగ నిలిచియే, బహుళముగా తోచును. నీ వికవృత్తులమాని నివృత్తిని చేపట్టితివేని, పురుషు డును సూర్యబింబము పెద్ద అద్దమునందువలె మహానంద మూర్తియై ఒప్పును. శివం అద్వైతం శాశ్వతం. శాంత

శ్రీరాగము—ఆదితాళము.

మన—దేవా! నీయాజ్ఞను శిరసావహింతును. తప్పను.

సర—ఆనందమానంద మాయెను నేటికి
అమలగుణకలాపా అవధరింపుము భూపా॥ అనం॥

1. యమ నియ మాసన ప్రాణాయామ ధ్యాన ధారణల
ఘనసమాధుల సిద్ధిని బొంది కైవల్యమందు మనసా ॥ ఆనం॥

2. వృత్తులన్నిటి విడచియు నివృత్తిబొంది బ్రహ్మాకార
వృత్తితో నిర్వాతదీపముండు భంగిని నిలచి యుందువు। ఆనం॥

అగుగాక జ్ఞాతులకు ఉదకదానముచేయు నిమిత్తము పోదము రమ్ము.

మన—మహాప్రసాదము. (తెరవాలును.)



# ప్రబోధచంద్రోదయ

## నాటకము.

## షష్ఠమాంకము.

(శాంతి ప్రవేశించుచున్నది.)

శాంతి—(తనలో) "పుత్రీ! శాంతీ! నీకు అంతయు తెలిసినది. కొడుకులు మరణించిరను దుఃఖముతోను, మహామోహుఁడు ఎక్కడికో పోయి దాగుటచేతను, మనస్సు శోకించి శోకించి, తుదకు విరక్తుఁడైనాఁడు. వైరాగ్యుని చేరదీసి ఊరటపొందినాఁడు. నీవు త్వరితముగాపోయి ఉపనిషద్దేవికి హితముచెప్పి నాసమ్ముఖమునకు తీసికొనిరమ్ము" అని వివేకమహారాజుగారు సెలవిచ్చిరి.-ఇదిగో! తనలో తానేదియో ఆలోచించుకొనుచు నా జనని శ్రద్ధాదేవి యిటువచ్చుచున్నది.

(శ్రద్ధప్రవేశించును.)

శ్రద్ధ—ఓహో! మనరాజకులము ఆరోగ్యము పొందగాచూచి ఇప్పుడుగదా చిరకాలమునకు నాకన్నులు అమృతపూరములైనవి. రాజవంశమునందలి దుర్మార్గులు నిర్జితులైరి. శమాది సత్పురుషులు మరల మాన్యతగాంచిరి. సర్వేశ్వరునకు వశ్యులై జీవులెల్లఱు సేవలు చేయుచున్నారు.

శాంతి—(చేరబోయి) అమ్మా! నమస్కారము. ఏమి ఆలోచించుచుంటిరి?

శ్రద్ధ—బిడ్డా! రాజకులము నేటికి ఆరోగ్యము పడయుటను తలచి ముదము పడయుచుంటిని.

శాంతి—ఇప్పుడు మనస్సు విషయమున స్వామియైన పురుషుని అభిమతము ఎట్లున్నది?

శ్రద్ధ—వధ్యుని విషయమునను లేక నిగ్రాహ్యుని విషయమునను ఎట్లుండవలయునో అట్లున్నదని తలచెదను.

శాంతి—అటులగుచో స్వామికి సామ్రాజ్యపాలనము పూనునా?

శ్రద్ధ—సందేహమేమి? స్వరూపానుసంధానము చేసిన యెడల స్వామియే స్వారాట్టును సామ్రాట్టును అగును.

శాంతి—ఇక ఈశ్వరునకు మాయ యందు ఎట్టి అనుగ్రహముకలదు?

శ్రద్ధ—నిగ్రహమనవలెను. అనుగ్రహమెటుల కలుగును? ఈశ్వరుడిప్పుడు సర్వానర్థ బీజభూతయయిన ఈమాయ సర్వథా నిగ్రహింపతగినది అని నిశ్చయించినాడు.

శాంతి—అట్లయిన పక్షమున రాజకుటుంబము యొక్క స్థితి ఇప్పుడు ఎట్లున్నది?

శ్రద్ధ—వినుము. పురుషునకు నిత్యానిత్యవిమర్శ భార్య. వైరాగ్యుడు సన్మిత్రుడు. యమాదులు ఆశ్రితులు. శమాదులు ఆప్తులు. మైత్ర్యాదులు పరిచారికలు. మోక్షేచ్ఛ సహవాసి. దుష్కృతులగు మహామోహాదులు చేజిక్కినచో దండించుట నిశ్చయము.

శాంతి—ధర్మునియెడ స్వామికి ఎట్టి ప్రీతికలదు?

శ్రద్ధ—పుత్రీ! వైరాగ్యునితోడి మైత్రికుదిరినది మొదలు స్వామి ఇహపర భోగసమితియందు విరసుడైయున్నాడు. అందువలన నశ్వరమగుటచేత పాపఫలమునకు వలెనే పుణ్యఫలమునకును వెఱచుచున్నాడు శుద్ధమగుబుద్ధితో నిష్కామముగ సలుపు సుకర్మకు మాత్రము ఎట్టిటులో ఇష్టపడుచున్నట్లు అగపడుచున్నాడు. ఇటుల స్వామి ఆత్మైక నిష్ఠుడయియున్నాడు. అది కనిపెట్టి

ధర్ముడు తాను కృతకృత్యుడైనటుల ఎంచుకొని తనకుతాన వ్యాపారము వదలుకొన్నాడు.

శాంతి—అప్పుడు యోగవిఘ్నను వెంటనిడుకొని మహామోహుడు అదృశ్యుడయినాడు గదా, వాని వృత్తాంతమేమి ?

శ్రద్ధ—పుత్రీ! దురదృష్టపాలయ్యెను బుద్ధికలవక, మహామోహుడు ఇంకను మోసపుచ్చ నిశ్చయించి, మధుమతి అను విద్యను తోడుచేసి, యోగవిఘ్నను పంపియున్నాడు. ఈయోగవిఘ్నకు స్వామి చిక్కినయెడల, వివేకునకు ఉపనిషద్దేవితో మరల ఎడబాటుకూర్చి కసితీర్చుకొనగలనని వాని ఆశయము.

శాంతి—(ఆతురతతో) ఔరా! తరువాత తరువాత ?

శ్రద్ధ—తరువాత మహామోహుని పనుపున వారుపోయి, స్వామికి ఒక యింద్రజాలవిద్యను చూపిరి. అత్యాశ్చర్యకరమగు ఒక చిత్రరూపమునుచూపిరి.సంభ్రమము తోప బూటకముల పలికిరి.

హిందుస్తాని బ్యాగ్—ఆది.

1. ఆహా ఆయింద్రజాలమూ యేమనిదెల్పుదును తల్లిరో ॥అహా॥ఆ॥ చిత్రము. చిత్రము, చిత్రమతి విచిత్రమట! ఆయింద్ర॥
2. చిటికెలోపల నూఱుయోజనముల మేర చెప్పురహస్యము విను నటా ॥అహా॥ఆ॥
3. భారత రామాయణ కావ్యములమీరి బహుసేతుల్ రచియింప గలదటా॥ అహా॥ ఆ॥
4. నిత్యమై సత్యమైనెగడు స్వర్గంబును ప్రత్యక్షము జేయగల్గు నట॥ అహా॥ఆ॥

ఇట్లు చెప్పుచునే మధుమతీవిద్యచేత కల్పింపబడిన విచిత్ర ప్రదేశమునకు స్వామిని తోడ్కొనిపోయిరి. అప్పుడు ఆ స్థానాధి దేవతలు ఆశలుపుట్టునట్లుగా స్వామితో ఇట్లనిరి. "ప్రభూ! ఇందుకూర్చుండుడు.

ఇచ్చోటున చావు పుట్టువులు లేవు. ఇది సహజసుందరమైన తావు. ఇరుగో విలాసవతులగు గాంధర్వకాంతలు. అరుగో లావణ్యరూపలగు విద్యాధర రమణులు. అటులచూడుము పరిణయనిపుణలగు అప్సరో గణము వీరింగూడి నీవు ఎనలేని సుఖముల పడయగలవు!"

శాంతి—అటుపిమ్మట ?

శ్రద్ధ—అప్పుడు మాయవచ్చి అటులచేయుట చాల శ్లాఘ్యమని చెప్పినది! మనస్సు ఆమోదమును తెలిపినాడు! సంకల్పుడు ప్రోత్సాహము చేసినాడు! స్వామి అంగీకారమును సూచించి నట్లుండెను.

శాంతి—(దుఃఖముతో) అయ్యో! స్వామి మరల సంసారపు వలలలో తగులు పడెనా?

శ్రద్ధ—లేదు లేదు.

శాంతి—అవల నేమిజరిగినది?

శ్రద్ధ—అప్పుడు ప్రక్కనున్న తర్కుడు కోపావేశముతో స్వామిని చూచి యిట్లనెను: "ఓహో! స్వామీ! ఎఱనుబోలు విషయ సుఖముల చూపుచు, లోనున్న గాలమును కప్పిపెట్టి మోస పుచ్చ ప్రయత్నించుచుండగా, వీని పన్నుగడల తెలియజాల కున్నాడవేమి? సంసార సాగరమును దాటి, యోగసిద్ధి పడసి తీరము సమీపించి, అల ఒడ్డుచేరి మోక్షసతిని గూడు తఱిని, నీవేల ఆశకులోబడి, భోగాగ్నికుండమున పడి, దగ్ధమై పోనుంటివి?

శాంతి—అటుతరువాత?

శ్రద్ధ—ఆ తర్కుని మాటలవిని, పురుషుడు తక్షణము విషయ సుఖాల కొక నమస్కారము అని పలికి మధుమతిని తిరస్కారము చేసినాడు.

శాంతి—మేలు మేలు ! నేను వేగిరము పోవలసియున్నది. తల్లీ! నీ విప్పుడు ఎక్కడికి బయలుదేఱినావు ?

శ్రద్ధ—స్వామి నాతో నేను వివేకుని చూడగోరుచున్నాను. కాన నీవు వానికొఱకు పోయి శీఘ్రముగా వానిని తోడ్కొనిరమ్ము అనిరి. నేను వివేకమహారాజుగారి కడకు పోవుదానను.

శాంతి—ఉపనిషద్దేవిని తీసికొనిరమ్మని నాకు మహారాజుగారు ఆన తిచ్చినారు. అగుగాక ! మనము వారి ఆజ్ఞలనెఱవేర్తము.

(వేర్వేఱుమార్గముల నిష్క్రమింతురు.)

(పురుషుఁడు ప్రవేశించును.)

పురు—(హార్షముతో) ఆహా !

గీ. విష్ణుభక్తి మహాత్మ్యంబు వినుతిఁజేయ
వశముగాదిఁక దేవతావళికి నైన
ఆ మహాదేవి కరుణచే నద్భుతముగ
మోహసంసారవార్ధిలో మునిగిపోక
ఆశలనెడు తరంగాల గాసిపడక
బ్రతికితిని నేటికిటులెన్న పరమనియతి.

ఏమి యీ విష్ణుభక్తిదేవి మాహాత్మ్యము! ఆమె సాంద్రకరుణా విశేషమువలన క్లేశములనెడు అలలను ఎన్నిటినో దాటితిని; మమతలనెడు సుడులంబడియు బయటబడితిని. బంధుమిత్రకళత్రములను నక్రముల బారినుండి తప్పించుకొనగల్గితిని—ఎవరో వచ్చుచున్నట్లున్నది.

(వివేకమహారాజును శ్రద్ధయు ప్రవేశింతురు)

వివే—శ్రద్ధా! శాంతి నాప్రియురాలైన ఉపనిషత్కాంతనుచూచునా?

శ్రద్ధ—దేవా! మీపనుపున వెళ్ళియున్న శాంతి, ఆమెను ఏల చూడకుండును?

వివే—ఎక్కడ చూడగలము?

శ్రద్ధ—దేవా ! మందర పర్వతమునందు, మధుసూదనాలయములో తర్కవిద్యల భయముచేత, గీతాదేవి మఱుగున దాగినది. ఈ సంగతిని ఈవలకే విష్ణుభక్తిదేవి తెలిపియున్నది.

వివే—ఉపనిషత్కాంత తర్కవిద్యలకు భయపడెనా? ఎట్లు?

శ్రద్ధ— దేవా ! ఆవృత్తాంతమును ఆమెయే మీకు స్వయముగ తెలుపగలదు. ఇదె పురుషుడు మీకొఱకై ఎదురు చూచుచున్నాడు.

(నిష్క్రమించును.)

వివే—( చేరువకుపోయి నమస్కరించి ) స్వామీ ! వివేకుడ అభివాదము చేయుచున్నాడను.

పురు—వలదు వలదు. వత్సా! ఇది సామాన్యసదాచారము. అయినను ఇచ్చట ఉత్తమధర్మవిరుద్ధమైనది. జ్ఞానవృద్ధుడవైన నీవు ఉపదేశదానముచేత నాకు తండ్రివైతివి. పూర్వము ఒకసారి విప్రులు విమూఢులై ధర్మమార్గము తప్పిరి. దారి తెలియజాలరైరి. తమకు దారిచూపుమని కొమరులను వేడికొనిరి. జ్ఞానసంపదచేత వారిని శిష్యులనుగ స్వీకరించిన పుత్రులు, తండ్రులనే "కుమారులారా ! వినుడు"అని సంబోధించిరి. అటులనే నీవును మాయెడ పితృభావమును వహింపదగును. అదియే ఉత్తమ ధర్మము.

(శాంతి, ఉపనిషద్దేవి ప్రవేశింతురు.)

ఉప—సఖీ ! నాథు నిర్దయుడై నన్ను విడిచివేసి, చిరకాలము పరదారవలె చూచిన భర్తగారి ముఖమును ఇప్పుడు నేనెట్లు చూడగలను?

శాంతి—ఆపదపాలై అటుల కావించిన భర్తను నిందింప పాటిగాదు.

ఉప—సఖీ! అప్పటి నాకష్టములను నీవు ఎఱుంగవు కాన ఇట్లు పలుకుచున్నావు. చెప్పెద; వినుము. భర్తయగు వివేకమహారాజుగారు నన్ను విడిచివేయుటచేత, దుష్టులెల్లఱును నన్ను తమ

దాసిగా తలపోసినారు. సభలలో కొప్పుపట్టి గన్నీడ్చి అవమానించినారు. కుతర్కముల పాల్చేసి నాయందు నీచములగు అపార్థములను కల్పనచేసినారు. అప్పుడు తెగిన కేశములును, రాలిన మణిహారములు. చిరిగిన చీరయు సవరించుకొనుటకైన వసతి చిక్కదయ్యెన.

శాంతి—ఊరడిలుము! అనంతము గల మహామోహపాతకుని విజృంభణ ఫలము నీకు తెలియుదా? ఇందు నీభర్తగారి అపరాధమేమున్నది? మనస్సుసంయోగము కామాదుల సాహాయ్యమున వాడు మోహపెట్టినాడు. ఇట్టి దురవస్థలో వివేకమహారాజు నిన్ను నిందింపవలసిన వాడెవ్వడు. ఎట్టి యిక్కట్లపాలైన భర్తగారిని దూరక, అవనెఱిగి దరిచేసుటకై ఎదురుచూచుచుండుట పతివ్రతకు ధర్మము. నీవు వచ్చి నీదర్శనము చేతను ప్రియాలాపముల చేతను భర్తను సంభావింపుము. ఇప్పుడు శత్రువులు హతులైరి. నీమనోరథములు సంపూర్ణముగ ఫలప్రదములు కాగలవు!

ఉప—సఖీ! నేను ఇటకు వచ్చునప్పుడు నా కూతురైన గీతాదేవి 'స్వామియైన పురుషునను భర్తయు నిన్నడుగు ప్రశ్నలకుసదుత్తరముల నిచ్చి నీవు వారిని సంభావింపవలయును. తనూమ్మలమున ప్రబోధోత్పత్తి కాగలదు' అని రహస్యముగ తెలిపినది. పెద్దల ఎదుట నేను ప్రాగల్భ్యమును ఎట్లు చూపుదునా యని శంకించుచున్నాను.

శాంతి—భగవతియైన గీతాదేవియొక్క ఈ వాక్యములకు నీవు విచారింప పనిలేదు. ఈ అర్థమును భగవతియగువిష్ణుభక్తిదేవి వివేకస్వామితోడ చెప్పినది. కావున నీవువచ్చి భర్తను ఆదిపురుషుని దర్శింప సంశయింపకుము.

ఉప—ప్రియసఖి చెప్పినట్లు చేసెద.

శాంతి—దేవీ! అదె వివేకమహారాజుతోడ పురుషుడు అటనున్నాడు. వారిని సమీపించుదము.

(శాంతియు ఉపనిషత్కాంతయు సమీపింతురు. ఉపనిషత్కాంత పురుషునికి నమస్కరింపబోవును. పురుషుడు వెలవెలబోవును.)

శాంతి—స్వామీ! ఇదిగో ఉపనిషద్దేవి మీ పాద వందనము చేయుచున్నది. (పురుషుడు వందనము చేయును.)

పురు—(తత్తరపాటుతో) అటుకాదు, అటుకాదు.

బ్యాండుస్వరము _ ఆది.

1. వలదు వలదు వలదు నాకు వందనంబుజేయగా
చెలగి ఈమె తత్వబోధజేసె నాకు మాతగా ॥వలదు॥
2. ముందుగ నేనీ తల్లికి నందనంబుజేసెదా ॥వలదు॥
3. మాత మరియు నీమెజగన్మాత నాకు తలపగా ॥వలదు॥

మాతకును జగన్మాతకును పుడమిలో చాల భేదము గలదు. మాత భవబంధముల కూర్చునది; జగన్మాతయో భవబంధములను త్రుంచునది.

ఉప—(వివేకునికి నమస్కరించి దూరమున కూర్చుండును)

శాంతి—(వివేకునికిని పురుషునికిని నమస్కరించి తనలో) ఈవృత్తాంతమును విష్ణుభక్తిదేవికి నివేదింతుగాక! (నిష్క్రమించును.)

పురు—అమ్మా! ఉపనిషద్దేవీ! నీవు ఇంతకాలమును దినములు ఎటుల గడపితివో తెలుపుము!

ఉప—స్వామీ! చాలదినములు మూర్ఖులతోకూడి మఠములందు గడపితిని. రచ్చలందును శూన్యదేవళంబులందును వ్యర్థప్రసంగములతో కాలము పుచ్చితిని.

పురు—మఱి, వారేమైన నీవలన తత్త్వమును తెలిసికొనిరా?

ఉప—లేదు లేదు. కపట న్యాయవాదులవలె, వారు నా పలుకులకు అపార్థకల్పనలచేయుచు, నా సూక్తులను తమ దుష్కార్యములకు అనుకూలములుగ మార్చి వాదించసాగిరి. నాకు కంఠశోషయేగాని వారికి ఉపకరింపజాలనైతిని. వారికి, కటా, కనకమే పరమార్థము. నీచభోగములే పరమగమ్యము!

పురు—తరువాత తరువాత?

ఉప—ఒక చోటున ఆజ్యపాత్రలను సుక్స్రువములను చేతబూని, సోమేష్టి మొదలగు పశువధకారణము లయిన యాగములను ప్రోత్సహించుచు, ప్రాకృతకర్మలను అల్లిబిల్లిగ కూర్చిన గ్రంథములను మోసికొనిపోవు యజ్ఞవిద్యను మార్గమధ్యమున పొడగాంచితిని.

పురు—తరువాత తరువాత?

ఉప—మోపెడు పుస్తకములను నెత్తిన మోయుచున్న ఆమెకు నా తత్త్వము ఏమైన తెలిసియుండునని తలచి, ఆమె చెంత కొన్ని దినములు గడపనెంచి సమీపించితిని.

పురు—అప్పుడేమి జరిగినది?

ఉప—"ఓసుమంగళీ! నీకోరిక ఏమి!" అని నన్నడిగినది అమ్మా! నేను ఇప్పుడు అనాథనైయున్నాను. నీ అండనుండ కోరుచున్నాను" అంటిని.

పురు—తరువాత?

ఉప—సుమంగళీ! నీవు చేయగలపనియేమి?" అని ప్రశ్నించినది. నే నిట్లు చెప్పితిని. ఎవనిలో జగము జనించునో, రమించునో, లయించునో, ఈజగతి ఎవనికాంతిచే ప్రకాశించునో, ఎవ్వని తేజము సచ్ఛభోజ్వలమై ఒప్పునో, ఎవ్వని తెలిసి ద్వైతతమస్సు దాటిన యెడల పునర్జన్మకలుగదో, ఆ పురుషోత్తముని నిత్యుని అక్రియుని ఈశ్వరుని నేను సతతము ఉపాసింతును." అంతట యజ్ఞవిద్య ఆలోచించి అతడు అక్రియుడంటివి. ఇక ఈశ్వరు డెట్లు కాగలడు? సత్క్రియలు లేని వస్తువిచారబుద్ధి భవబంధ ముక్తిని చేకూర్చజాలదు. జనుడు భవనాశనకరకర్మలను చేయుచు నూరు వత్సరములు బ్రతుకగోరునుకాదె? కాబట్టి నేను నిన్ను చేరదీయుట, ప్రయోజనకరముగా తోచదు. అయినను నీవు

కర్తయు భోక్తయు అగు పురుషుని ప్రస్తుతించుచు కొంత కాలము నాచెంతనుండ నిచ్ఛగింతువేని నాకు ఆక్షేపణ ముండదు" అన్నది.

వివే—ఆహా! ఏమి? నిప్పులో పడబోసిన నేతిపొగలచేత నలుపువారిన యజ్ఞవిద్య, ఎట్టి దుష్ప్రజ్ఞను చూపుచున్నది? ఆమె ఈ ప్రకారముగా కుతర్కముచేత పాడైపోయినది. సహజముగ జడమైన ఇనుము సూదంటురాతి సమీపమున నాట్యములు సలుపులీల మాయయు విశ్వసాక్షియగు ఈశ్వరుని సమక్షమున వాని సన్నిధానమహిమవలన, సృష్టిస్థితిలయముల నడపుచు, అదంతయు ఈశ్వరుని పనియే యని చాటుచుండును. ఈ కపటనాటక రహస్యము నెఱుగని కర్మఠులు అజ్ఞానాంధకారమునబడి కొట్టుకొనుచు దారి గానకున్నారు. అజ్ఞానముచే తోచు సంసారమును ఈ కర్మలచేత పోగొట్ట చూచుచున్నారు. చీకటి చీకటిని పోగొట్టునా? అశ్వరములును అజ్ఞానజన్యములునైన సకలలోకములను ప్రకాశమొనర్చు ఈశ్వరుని భోక్తగా నెంచి లంచగొండియని తలంతురు. అతని కర్తగను భోక్తగను చాటవలయు నను నా ఈయజ్ఞవిద్య?

పురు—తరువాత ఏమి జరిగినది తల్లీ?

ఉప—తరువాత యజ్ఞవిద్య మరల ఆలోచించి, "ఓ సఖీ! నీవు ఇచ్చోట నుంటివేని నాశిష్యులు దుర్బుద్ధిగ్రస్తులై కర్మలయందు విశ్వాసము పోనాడుదురు. కాబట్టి నాయందు అనుగ్రహముంచి వేఱొక తావునకు పొమ్ము" అన్నది.

పురు—అంతట ఎటకేగితివి?

ఉప—తరువాత కర్మకాండ సహచరియైన మీమాంస నాకు కాన్పించినది. ఆమె అధికారయోగ్యముగ కర్మలను విభజించి, శ్రుతిప్రమాణముల నాధారముచేసి విచిత్ర సిద్ధాంతముల బయలు దేరతీసి సంఘములను నడపుచున్నది. ఆమెకడకు పోగా

ఆమెయు నేను చేయగల పనేమని అడిగినది. ఎప్పటిరీతినే చెప్పితిని. ఆమె తన చుట్టునున్నవారినిచూచి "ఈ ఉపనిష త్సాంత లోకాంతరఫలభోగయోగ్యుడయిన పురుషుని ప్రతిపాదించును. మనకు ఈమెవలన కొంత ప్రయోజనము కలుగవచ్చును. కాబట్టి కర్మలకు అనుకూలించుచో ఈమెను స్వీకరింతును అన్నది. కాని కర్మలకు అనుకూలించు పురుషుని ఈమె ప్రతిపాదించుటలేదని పూర్వమీమాంస హెచ్చరించినది. ఇంకను

సీ. కర్తయు భోక్తయు గాని ఈశ్వరుని వ
ర్ణింతువాయని కుమారిలుడు లేచె;
భువనాంతరవ్యాపి పురుషుండుగలుగ వా
నికి వేఱవడని ప్రశ్నించె నొకతె;
జగములో నీశు డీశ్వరునిలో జగమునిం
సరిగానిదని మాఱుచాటె నొకతె;
ఈ సంశయ లతాళికిది లవిత్రోపమ
వ్యాఖ్యానమని ప్రగల్భములు కొట్టి
పఱగు సృష్టిస్థితిలయాద్యవస్థలెల్ల
వేఱువేఱు పురుషులు గావింతురంట!
ఉపనిషద్దేవి దుష్ప్రలాపోహాలిప్వ!
మేలుమేలని ఒకఁడు గేలిచేసె.

వివే.—(హర్షముతో) కుమారిలస్వామీ! అందఱిలో నీవె బుద్ధిశాలివి అనుకొంటిని ఈమాత్రము తెలియవా?

గీ. తరువుశాఖలపై శకుంతములు రెండు
వాసమొనరించు ప్రేమమీడి. వాన నొకఁడు
ఫలముల భుజించుచుం దీపి కలిగినప్పు
డుల్లసిలి చేదుకల్గుచో నుత్తలపడు.
అట్టి యారాటమునుదక్కి ఆత్మతృప్తి
రెండవది మహానందమూర్తిగ వెలుంగు.

దీని అర్థము పరమ రహస్యము. నీకు తెలియదా?

**పురు**—తల్లీ! తరువాత నీవేమిచేసితివి?

**ఉప**—నేను మీమాంసయొద్ద సెలవుతీసికొని వెడలితిని. పలువురు శిష్యులతో కూడియున్న తర్కవిద్యను పొడగాంచితి. వీరికి తప్పక నాతత్త్వము తెలిసియుండును అనుకొంటిని. అందొకతె విశ్వమునకు అతీతమౌ తత్త్వ మొకటి కలదు అనుచున్నది. ఇంకొకతె న్యాయశాస్త్ర సూత్రములను వల్లెవేయుచు వితండ వాదము సాగించినది. మఱియొకతె పురుషప్రకృతిభేదము అనిత్యము అన్నది. వేఱొకతె సాంఖ్యశాస్త్రచర్చను, పంచీకరణ విభాగమును ప్రతిపాదించుచు మహోపన్యాసమునకు గడంగినది. పర్యవసానమును ఎవరును తేలనిచ్చునటుల లేదు. అనుష్ఠానముగాని, అనుభవముగాని సరకుచేయువారు లేరు.

**పురు**—తరువాత తరువాత!

**ఉప**—పూర్వపురీతినే నేను వారి సమీపమునకు పోతిని. వారు నా వృత్తాంతమును విచారించిన మీదట, "ఎవ్వనిలో జగములు జనించునో రమించునో లయించునో"అనుచు వెనుకటి తీరున చెప్పితిని. అంతటవారు నన్ను ప్రత్యక్షముగా పరిహాసముచేయ మొదలిడిరి. "ఓసీ! వాచాలురాలా! జగము పరమాణువుల వలన పుట్టుచున్నది. ఈశ్వరుడు ఉపాదానకారణముగాని నిమిత్త కారణముకాదే"అన్నది. ఇంకొకర్తుక కోపముతో ఓసీ పాపాత్మురాలా! ఈశ్వరుని సవికారునిచేసి సర్వనాశనము చేయ తలపెట్టినావటే? అన్నది. వేఱొకతె "ఓసీ! విశ్వోత్పత్తి ప్రకృతివలన కలుగునదేగాని ఈశ్వరునికి ఇందు పనియే లేదు."! అన్నది.

**వివే**—ఓహో! ఈ తర్కవిద్యలకు తిక్క తలకెక్కినది. కుండ మొదలగు నామరూపముల ధరించినవెల్ల "కార్యములు." సర్వకారణుడు పరమాత్మ. అధ్యాసచేత ఆ కారణత్వము ప్రకాశించును. అప్పుడు ప్రకృతి వేఱొకటియుండి జగత్తునకు ఉపాదాన కారణ

మగుచుండెనను స్వతంత్రవాదన యేల? జలమున కాన్పించు చంద్రునివలె, స్వప్నమున కాన్పించు ఆకాశనగరములవలె ఒక దశాంతరమున అనుభవమునకు నిలుచుచున్నను విశ్వము అసలు మిథ్య. ఆలుచిప్ప వెండివలె తోచునట్లు, తెలివియే జగముగ తోచును. ప్రజ్ఞోదయము కాగానే త్రాడు నందలి పామువలె సకలము పాసిచనును. ఇట్టి జగజ్జాలకల్పనల వలన నిత్యప్రకాశుడగు పరమాత్మయందు వికారలేశమేని కలుగ జాలదు. హేసద్గురుప్రభో!

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణ రహితం సద్గురుం తన్నమామి॥

పురు—సాధు సాధు. ప్రజ్ఞావంతుడవైన నీ ఈ విమర్శనము నాకెంతయు ముదమును గూర్చుచున్నది. తల్లీ! తదనంతరమేమైనది?

ఉప—తదనంతరము నేనొకింత వారి పొరబాట్లను తెలుపనెంచగా వారందఱును మండిపడిరి. "ఓహో! విజ్ఞానాశమును ముక్తికి మార్గమని ప్రేలుచున్నది. దీనిని పట్టుడు కొట్టుడు" అనుచు నాపైబడిరి.

పురు—(భయముతో) కటా! ఆపయిని?

ఉప—ఆపయిని నేను మిక్కిలి త్వరితముగా పాఱిపోయి దండకారణ్యమున దూరితిని. అంతట మందరగిరి సమీపమున నిర్మింపబడియున్న మధుసూదనాలయమునకు చేరువను నన్ను వెన్నంటి వచ్చిన కుతర్కవిద్యలు నాకంకణములను భగ్నము చేసిరి; తలమానికముల నేలరాల్చిరి, కేశములను త్రెంచిరి, హారములను తుత్తునియలు చేసిరి. కట్టుబట్టయు హరించిరి.

పురు—తరువాత తరువాత?

ఉప—అప్పుడు దేవాలయమునుండి గదలధరించి వెలువడివచ్చిన పురుషులు వారిని నిర్దయగా మర్దింప పూనగా వారు నలుదిశలకు పాఱిరి.

వివే—(హర్షముతో) పూజ్యురాలవయిన నీమెడ అత్యాచారములు చేసినవారికి శిక్షతప్పదు కదా! విశ్వసాక్షియగు భగవంతుడు ఉపేక్షించునా? ఇంకను నీవుపడిన పాట్లెన్నిగలవో?

ఉప—

నాదనామక్రియ—ఆది.

ఏమని దెల్పుదునో నాథా। నాపడినబాధ॥ ఏమని॥

1. చీరజించి హారంబుల ద్రెంపిరి, చిందరవందర జేసి కేశముల్ జాఱదివిచి, భూమిపైనిబడగా చయ్యనద్రోసియు నీడ్చిలాగిరిక॥ఏ॥

2. కాయముతూలగ, కాలియందెయలు
ఘల్లుమంచు నేల రాలిపోవగ
ధీయుతురాలై వెలయు సుగీతా
దేవిగృహామునకు, పరుగులెత్తితిని॥ యే॥

3. పాపాత్ములు నను బెట్టుబాధలకు,
పల్మారువగచుచు నామకూతు రా
గీతాదేవియు, కట్టుబట్టనిడి కృపతో
జూడగ బ్రతుక గంటినిక॥ యే॥

4. వగవకమ్మ; నిను బాధించినయా
పరమపాతకుల ఖండనజేయును
ఖగవాహానుడని యూరడింపుచును
కౌగలించి నావెతలను బాపెను॥ ఏ॥

సర్వసాక్షి ఈశ్వరుడు కలడుగదా!

పురు—(సంతోషముతో) దేవీ! ఆ ఈశ్వరుడు ఎవడో నీ అనుగ్రహమువలన తెలియగోరుచున్నాను.

